వళ్లత్తోళ్ నారాయణ మేనోన్ (1878-1957) ఆధునిక మలయాళ కవితకు నూతన రీతులు చూపిన ప్రముఖులలో ఒకడు. అతనిది సంప్రదాయబద్ధమైన చదువు. అతడు సంస్కృతంలో నిష్ణాతుడు. వాల్మీకి రామాయణాన్నీ, ఋగ్వేదాన్నీ మలయాళంలోకి అనువదించాడు. బధిరత్వం బాధించినా సాహిత్య సేవలోనూ, కథకళీ నృత్యాన్ని పునరుద్ధరించడంలోనూ జీవితమంతా ధారపోశాడు. కళామండలం స్థాపకుడిగా తన బృందంతో శాంతినికేతన్, సోవియట్ రష్యా, చైనా, ఫ్రాన్సులు పర్యటించాడు. గాంధీని తన గురువుగా భావించాడు. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వపు బహుమతిని తిరస్కరించిన దిట్ట అతను. అతని ఇతివృత్త విస్తృతి ఆశ్చర్యం కలిగిస్తుంది. మలయాళ భాష ఎంతవరకు చెయ్యగలదో అంతా చేసి చూపించడమే అతని కవితలోని సార్థక్యమూ, పరమార్థమూ. అతను సంప్రదాయ ద్రష్ట మాత్రమే కాదు, కాల్పనిక స్రష్ట కూడా. సాహిత్య అకాదెమీ సభ్యుడిగా పని చేశాడు; 1955లో 'పద్మభూషణ్' బిరుదు అందుకున్నాడు.

ఇంగ్లీషులో బోధన చేసే బి. హృదయ కుమారి మలయాళంలో విదుషీమణి. ఎన్నో విమర్శ గ్రంథాలకు ఆమె దే నగిషీ పని.

వెల: రూ. 2-50
ముఖ పత్రం: సత్యజిత్ రే
రేఖా చిత్రం: పి. వి. ధర్మరత్నం

భారతీయ సాహిత్య నిర్మాతలు

# వళ్ళత్తోళ్ నారాయణమేనోన్

ఆంగ్లమూలం:

బి. హృదయకుమారి

తెలుగుసేత:

అవసరాల రామకృష్ణారావు




సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

VALLATHOL —

Telugu translation by Avasarala Ramakrishna Rao of the English Monograph of the same name by B. Hrdayakumari. Sahitya Akademi, New Delhi, 1977.

Price Rs. 2-50



*First Edition : 1977*

SAHITYA AKADEMI

Rabindra Bhavan, New Delhi-1

*Regional offices .*

Madras-6, Calcutta-29 & Bombay-14

Published by Sahitya Akademi and Printed at Weldun Press, 7/1, Mannappa Mudali St., Madras 21.

ఎంతో సాహసంతో నేను తలబెట్టిన ఈ కవితానువాదాన్ని
ఎన్నో విధాలుగా సూచన లిచ్చి ప్రోత్సహించిన
డాక్టర్ సి. నారాయణరెడ్డి (హైదరాబాదు)
శ్రీ జీడిగుంట జగన్మోహనరావు గార్లకు
రచయిత కృతజ్ఞుడు.

# వి ష య సూ చి క

| సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 1. | ఉపోద్ఘాతం | .... | 5 |
| 2. | సంప్రదాయవాది | .... | 13 |
| 3. | జాతీయకవి | .... | 22 |
| 4. | వళ్ళత్తోళ్ లఘుకృతులు - ఒక పరిశీలన | .... | 34 |
| 5. | వళ్ళత్తోళ్ కథాకథన కవిత | ... | 48 |
| 6. | వళ్ళత్తోళ్ ప్రకృతి చిత్రణ | .... | 65 |
| 7. | వళ్ళత్తోళ్ కాల్పనిక కవిత | ... | 75 |
| 8. | గద్య రచయితా విమర్శకుడూ | .... | 82 |
| 9. | వళ్ళత్తోళ్ కవితా శిల్పం | | 86 |
| 10. | ఉపయుక్త గ్రంథసూచి | . . | 99 |

ఒకటో ప్రకరణం

# ఉపోద్ఘాతం

భారతీయ సాహిత్యం ఇరవయ్యో శతాబ్దంలో అపూర్వ ప్రగతి సాధించింది. పాశ్చాత్య సాహితీ సంస్కృతుల సాన్నిహిత్యమూ, సాంఘిక జీవనంలోని ఒడుదుడుకులూ ఈ ప్రగతికి దోహదంచేశాయి. మలయాళ సాహితికూడా ఈ ప్రభావాల తాకిడికిలోనై కొత్తపుంతలు తొక్కింది, కొంగ్రొత్త చైతన్యస్పృహ అలవరచుకుంది. రాశిలోనూ వాసిలోనూ సెబాసనిపించుకుంది. మలయాళ సాంస్కృతిక పునరుజ్జీవన కర్తలు సంప్రదాయ సంస్కృతితో గాఢంగా పెనవేసుకున్నవారు, క్రొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు దిద్దగల మేధావులు. కుమారన్ ఆశాన్, వళ్ళత్తోళ్ నారాయణమీనన్, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్ - ఈ ముగ్గురు ప్రముఖ కవులతో మలయాళ కవిత ఆధునికయుగంలో అడుగుపెట్టింది. ఈ ముగ్గురూ 1870 ప్రాంతంలో జన్మించినవారే. మేధాసంపత్తిలోనూ అభిరుచుల వైవిధ్యంలోనూ ఇంచుమించు ఒకరినొకరు తీసిపోరు. భాషలోని ప్రతిభా విశేషాల్లూ, సనాతన సంప్రదాయాలూ, ఆనాటికొత్తపోకడలూ - వీటి వ్యక్తీకరణలో మాత్రం ఎవరి ధోరణి వాళ్ళది.

16-10_1878 న వారాయణ మీనన్ జన్మించాడు. ఆ పేరుకంటె వళ్ళత్తోళ్ అంటేనే అందరికీ బాగా తెలుస్తుంది. వళ్ళత్తోళ్ అనేది వాళ్ళ కుటుంబ నామం. వాళ్ళు మలయాళబ్రాహ్మణులు. కుట్టిప్పరు అమ్మా, దామోదరన్ ఎలయాతూ అతని తల్లిదండ్రులు చెన్నర అనే పల్లెటూళ్ళో అతను జన్మించాడు ఉత్తర కేరళలోని పొన్నైన్నితాలూకాలో ఓ భాగమైన వెట్టాతునాడుకి చెందుతుంది అది. వెట్టాతునాడు ఒకప్పుడు స్వతంత్ర రాజ్యం. వీరత్వానికీ కవిపోషణకీ ఆ రాజులు పెట్టింది పేరు. మలయాళ కవితా పితామహుడు తుంజత్తు ఎళుత్తచ్చన్ అక్కడ పుట్టిన చివురే'

వళ్ళత్తోళ్ చదువు సంస్కృత మలయాళాల్లో సాగింది. మలయాళంలో ప్రాథమిక విద్య అయిందనిపించాక మేనమామ రాముణ్ణిమీనన్ దగ్గిర అతను సంస్కృతం నేర్చుకొన్నాడు. రాముణ్ణిమీనన్ ఆయుర్వేద వైద్యంలో అందెవేసిన చెయ్యి, మేనల్లుడు ఆయుర్వేదంలో తనవంటివాడు కావాలని అతని ఆకాంక్ష. కావ్యాలూ నాటకాలూ పూర్తిచెయ్యడంలో మేనల్లుడికి చేయూత యిచ్చి కైకులంగార రామ వారియర్ అనే గొప్ప సంస్కృత విద్వాంసుడి దగ్గిరికి పంపించాడు. తనుమాత్రం అతనిచేత అష్టాంగహృదయం అనే భారతీయ వైద్య మూలగ్రంథాన్ని చదివించాడు. పద్యాలు అల్లడంలో మేనల్లుడికున్న ప్రతిభ గుర్తించాడు. శ్లోకాలు రాయమనీ సమస్యలు పూరించమనీ - యిలా ఎన్నోవిధాల ప్రోత్సహించేవాడు. వళ్ళత్తోళ్ స్నేహితులికి సాహిత్యమన్నా కథాకళి నృత్యమన్నా ఎంతోయిష్టం. వళ్ళత్తోళ్ తండ్రికయితే సరేసరి, కథాకళి ఉంటే ఇక అన్నం మంచినీళ్ళూ అక్కర్లేదు. చుట్టుపక్కల ఎక్కడ ఆ ప్రదర్శన అయినా ఆయన హాజరయి తీరవలసిందే. చిన్నప్పట్నుంచీ తండ్రితోపాటు వళ్ళత్తోళ్ కూడా ఆ ప్రదర్శనలకి సిద్ధం అయేవాడు. కథాకళి అంద ఛందాల పరిశీలన ఉగ్గుపాలతోనే అతన్లో మొగ్గతొడిగింది కవిత అన్నా కథాకళి అన్నా బాల్యప్రాయంనాడే ప్రాణపదం అయింది.

పదమూడో ఏడు రాకముందే వళ్ళత్తోళ్ పద్యాలు అల్లడం ఆరంభించాడు. సంస్కృతంలో అయినా మలయాళంలో అయినా సునాయాసంగా రాయగలిగేవాడు, తల్లిపోయినప్పుడు అతను రాసిన కొన్ని విషాద గీతికలు పరిశీలిస్తే అంత చిన్నప్పుడే సంస్కృతంమీద అతని కెంత ఆధిపత్యం ఉందో తెలుస్తుంది. ఇరవైయొక్క ఏళ్ళ వయసులో ఋతువుల్ని వర్ణిస్తూ ఋతువిలాసం అనే కవిత చెప్పేడు కాళిదాసు ఋతుసంహారానికి అది మలయాళ అనుకరణ. అందులో కొన్ని అచ్చు అయాయి. వ్రాతప్రతిలో ఉన్న మరికొన్ని పద్యాలు అతని స్నేహితులందరూ చదివేరు. ఇలా వళ్ళత్తోళ్ పిన్ననాటనే సాహితీరంగంలో పెద్ద పీటవేయించుకో గలిగేడు. ఆనాటి కొందరు సుప్రసిద్ధుల ఆమోదప్రమోదాలు లభించడం అతని అదృష్టం. అలా ప్రోత్సహించినవారిలో పునస్సేరినంపి నీలకంఠశర్మ అనే మహాపండితుడూ, సమూరితి రాజవంశానికి చెందిన ఎట్టన్ తంపురాన్ అనే కవిపోషకుడూ ఉన్నారు. ఈ కవిపోషణ వల్లనే యీయన్ని అభినవ భోజుడని చెప్పుకొనేవారు ఎట్టన్ తంపురన్ సారథ్యం వహించే పద్యపఠన కార్యక్రమాల్లో, సంగీత సభల్లో, సాహితీ సదస్సుల్లో తన సాంగత్యం అభిలషించేవాడని వళ్ళత్తోళ్ తన ఒకానొక కవితలో తలపుకు తెచ్చుకున్నాడు కూడా.

ఆనాటి కేరళ ఏమంత సౌభాగ్యసీమ కాదు. రాజకీయ స్వేచ్ఛ అంతంత మాత్రమే. అయినా అక్కడి సంస్కృత సంప్రదాయాలు చెక్కుచెదరలేదు మారు మూల గ్రామాల్లో అయినా సంస్కృత పఠనం జోరుగా సాగేది. ఎక్కడచూసినా రచయితలూ పండితులూను. ప్రాంతీయ దురభిమానాల్ని తోసిరాజనే మానసికాభి రుచులు వాళ్ళని ఓచోట ఓ సంస్థ సభ్యులుగా కట్టిపడేసేవి. రాజులూ, లక్ష్మీ పుత్రులూ గతవైభవాన్ని కోల్పోయినా పాండిత్యాన్ని పోషించే సంప్రదాయాన్ని మాత్రం నిలబెట్టుకున్నారు. ఆ రాజులూ వారి ఆస్థానంవారూ రచనల్లోని విశిష్టతల్ని స్వయంగా పసిగట్టగల రసజ్ఞులు. వీరిని మెప్పించగల సామర్థ్యం కవికి అవసరమయ్యేది. సమర్థుడయిన కవికి అర్థంచేసుకుని ఆనందించగల పాఠకులు లభించే వారు. ఈ విషయంలో ఏ యితర నాగరిక ప్రాంతానికీ కేరళ తీసిపోదు. ఇలాంటి ప్రోత్సాహకర వాతావరణంలోనే వళ్ళత్తోళ్ ఎదిగేడు, కవిగా నిలదొక్కుకున్నాడు.

ఇరవై మూడోఏట అతనికి పెళ్ళయింది పెళ్ళికూతురు మరెవరో కాదు. మామయ్య కూతురే. మాధవి ఆమె పేరు. చిన్నప్పటినుంచీ ఆమెను ప్రేమించాడు. ఒకప్పుడు తనతో ఆడుకున్న అమ్మాయి ఇప్పుడు జీవితంపంచుకునే ఇల్లాలు కాగా తనంత ధన్యుడు లేడని మురిసిపోయాడు వళ్ళత్తోళ్.

ఈసరికే అతను చాలా పద్యాలు రాశాడు అందులో ఇష్ట దైవప్రార్థనలూ పురాణ గాధలమీద ఆధారపడ్డ వర్ణనాత్మక కృతులూ వైద్యగ్రంథాల అనుకరణలూ అనువాదాలూ ఇలా అనేకరకాలు. వైద్యంగా స్థిరపడాలంటే మాత్రం యువకవికి అంతగా మనస్కరించేది కాదు సాహిత్యానికి పూర్తిగా అంకితం కావాలని అతని కోరిక. అదే జీవనోపాధి అంటే మాటలా? ఎవరో బాగా ఉన్నవాళ్ళకే చెల్లింది. అదృష్టవశాత్తూ తిరుచూరులో ఉన్న కేరళ కల్పద్రుమం అనే ముద్రణాలయానికి అతన్ని ముప్పై రూపాయిల నెలజీతం మీద, మేనేజరుగా వేసుకున్నారు ఆ రోజుల్లో, అదేమంత కొట్టిపారెయ్యవలసిన మొత్తంకాదు వళ్ళత్తోళ్‌కి ఆపనీ యిష్టమే, ఆ జీతమూ యిష్టమే. అందులో లభించే తీరుబడి అన్నిటికన్న యిష్టం. తనకి కావలసినట్టు మలచుకోవచ్చుదాన్ని. పందాలంరాజు ఆధ్వర్యం వహించిన కవనకౌముది అనే సాహిత్య పత్రికకి ఆరోజుల్లో, బహుళ ప్రచారం ఉండేది. దాని ప్రచురణ కల్పద్రుమం కార్యాలయానికి మార్చబడింది. ఆ ప్రచురణ విషయంలో వళ్ళత్తోళ్ ఎంతో సహాయం చేశాడు, అవసరమైనచోట తన రచనలు చేర్చడంతో సహా. తిరుచూరులో అతని మిత్రబృందం పెరుగుతూ వచ్చింది. కుంజికుట్టన్ తంపురన్, కుంమార్ నారాయణమీనన్, నాడువకు మోహన్ సంపూరితి, వలియ్యా

రామన్ ఎలయాత్తు — ఇలాంటి కవిపండితులతో వాళ్ళిల్లు ఎప్పుడూ పెళ్ళివారిల్లులా కళకళలాడుతూ ఉండేది. వళ్ళత్తోళ్ సంభాషణలో గుబాళించే హాస్యధోరణీ, కవితాభినివేశమూ వాళ్ళని ముగ్ధుల్ని చేసేవి. ఏ సాహితీ సభలో అయినా అతని ఉపన్యాసం కోసం అందరూ ఎదురుతెన్నులు చూసేవారు.

తిరుచూరు విడిచిపెట్టేముందు వాల్మీకి రామాయణం మలయాళం అనువాదం చేపట్టేడు వళ్ళత్తోళ్. ఊపిరిసలపని పనిమధ్యలో అయినా రోజుకి ముప్ఫై నలభై శ్లోకాలు అనువదించేవాడు. అప్పన్ తంపురన్, కుంజికుట్టన్ తంపురన్ లాంటి విద్వాంసుల ఆమోద ముద్ర లభించింది దానికి కొంతమంది చందాదార్లని పోగుచేసి వాళ్ళకోసం దాన్ని ధారావాహికంగా ప్రచురించాడు 1907 లో. ఆతర్వాత ఏకమొత్తంగా ఒకేసారి వెలువడిన ఆ కావ్యం ఎన్నో పునర్ముద్రణలు నోచుకుంది. మొదటి ప్రచురణకీ ఆతరువాతి వాటికీ ఎన్నో విషయాల్లో తేడాలున్నాయి. మొదటిది అంతగా పరిణితి చెందని వయసులో రాసినట్టు అనిపించి అందులో పద్యాల్ని రాటుదీర్చి నగిషీపెట్టి మళ్ళీ ప్రచురించాడు వళ్ళత్తోళ్.

తిరుచూరులో ఉన్నరోజుల్లో ఓసారి అతనికి బాగా జబ్బు చేసింది. దాంతో అతని చెవులు గళ్ళపడిపోయాయి. చెవుడు వచ్చిందని తెలియగానే అతనికి మతిపోయినట్టయింది. చూపించుకోని వైద్యుడు లేడు, చెయ్యి చూపించుకోని జ్యోతిష్కుడు లేడు. అలా గంగ వెఱ్ఱులెత్తిపోయాడు. ఆ చికిత్సలు ఓ పట్టాన పూర్తి అవనివి. ఓచోట స్థిమితంగా ఉండనివ్వనివి. ఎన్నో పద్యాలు వినిపించి దేవుళ్ళ గుండెలు కరిగేలా మొరపెట్టుకుంది కవి హృదయం. ఏం లాభం? పుట్టెడు చెవుడు దక్కడు! అయితే ఈ కీడులో ఓమేలు లేకపోలేదు. బధిరవిలాపం అనే అతని ఆత్మాశ్రయ కావ్యం దేశానికి మిగిలింది.

1910 లో కేరళ కల్పద్రుమం పని వదిలి అతను స్వగ్రామం చేరుకున్నాడు. స్వయంగా ఓ మహాకావ్యం రూపొందించాలని అతని సంకల్పం. గతశతాబ్ది చివర్లో మలయాళ విద్వత్కవుల్లో ఓరకం రచన అంటే గొప్పమోజు ఉండేది. సంస్కృత మహాకావ్యాల్ని ఒరవడిగా పెట్టుకొని వీరశృంగార రసాలు మేళవించిన వర్ణనాత్మక కావ్యం అది. అజకతు పద్మనాభకురూప్‌గారి రామచంద్ర విలాసం, పందాలం కేరళ వర్మరాజాగారి రుక్మాంగద చరితం, కొడుంగళ్ళూర్ కాజుణ్ణి తంపురన్‌గారి పాండవోదయం, కె. పి. కేశవపిళ్ళెగారి కేశవీయం, ఉళ్ళూర్‌గారి ఉమాకేరళం ఈ రకం రచనల్లో రవ్వతునకలు. ఆనాటి అభిరుచికి అనుగుణంగా వళ్ళత్తోళ్‌కూడా చిత్ర

యోగం అనే రచన చేశాడు. సంస్కృత కవి సోమదేవుడు రాసిన కథాసరిత్సాగరం లోని ఓ కథ దీని మాతృక ఇందులో ఉన్నవి 1591 పద్యాలు. ఇది పూర్తిచెయ్య డానికి రెండేళ్లు పట్టింది. ఈ కావ్యం రకరకాల విమర్శలకి గురిఅయింది. సనాతనులు సాదరంగా స్వీకరించారు, కుమారన్ ఆశాన్‌తోసహా. చాలామంది 'ఒకరు చెప్పింది పట్టుకు వేళ్ళాడ్డం, పాత పద్ధతులు పట్టుకు దేవుళ్ళాడ్డం తప్ప ఇందులో ఏముందని' పెదవి విరిచారు.

చిత్రయోగం ప్రచురణనాటికి వళ్ళత్తోళ్‌కి ముప్పై ఆరేళ్లు. ఆ తరువాత పదిహేనేళ్ళూ అతని ప్రతిభ ఓ వెలుగు వెలిగింది. అతని అత్యుత్తమ కవిత అవతరించింది అప్పుడే. అది నాటకీయమూ, గేయరూపమూ, వర్ణనాత్మకమూ, ఎన్నిరకాలని ! బంధనాస్తనాయ అనిరుద్ధన్ (బందీగా అనిరుద్ధుడు), శిష్యానుమ్ మకానుమ్ (శిష్యుడూ పుత్రుడూ) మేగ్దలేనమేరియం (మేరీ మేగ్దలీన్) అనేవి అందులోకొన్ని. సాహిత్య మంజరి అనే పద్య సంకలనాలు ఆ రోజుల్లో రాసినవే. అందులో మొదటిది 1917 లోనూ ఏడోది 1930 లోనూ వచ్చేయి. తర్వాత మరి నాలుగువచ్చేయి. కొన్ని సంస్కృత పురాణకావ్యాలూ, స్వప్నవాసవదత్తమ్ లాంటి ప్రసిద్ధ నాటకాలూ అనువదించాడు కవనకౌముది, ఆత్మపోషిణి లాంటి సాహితీ పత్రికల్తో అతనికి సన్నిహిత సంబంధాలు ఉండేవి కేరళోదయం అనే వార్తాపత్రికకి కొన్నాళ్లు సాహితీ సంపాదకుడిగా పనిచేశాడు

ప్రభుభక్తి అనేది మతం సమ్మతంపొందిన, భారతీయ తత్వంలో బాగా జీర్ణించుకుపోయిన ఒక లక్షణం. హిందూ పాలకులనుంచి బ్రిటిష్ అధినేతలకి అధికారం హస్తగతం అయినప్పుడూ, తాము పుట్టిపెరిగిన గడ్డమీద పరాయి ప్రభుత్వం న్యాయశాసనం విధిస్తున్నప్పుడూ చాలా మంది భారతీయులు నిశ్శబ్దంగా ప్రశాంతంగా ఆమోదించారు, ప్రభుభక్తి ప్రదర్శించారు. ఏలినవారు ఎడ్వర్డు అయితేనేం విక్టోరియా అయితేనేం సముద్రం అవతల్నుంచి పాలించి సురాజ్య స్థాపనచేసి మేలు చేకూర్చుతున్నందుకు ఎంతోమంది హిందూకవులు ప్రశంసా గానం చేశారు కూడా. ఇరవై మూడేళ్ళ తరుణప్రాయంలో వళ్ళత్తోళ్ ఏడవ ఎడ్వర్డు ప్రభువుని కీర్తిస్తూ పద్యాలు చెప్పేడు. అదే మరో ఇరవైయొక్క ఏళ్ళ తర్వాత చూస్తే అతని దృక్పథంలో దృఢవిశ్వాసంలో ఎంతో మార్పు. అతనికి కృషికి గుర్తింపుగా ప్రభుత్వం ఓ బహుమతి ప్రకటిస్తే ఒద్దు పొమ్మన్నాడు! 'నా గురువైన గాంధీని బందీచేసిన ప్రభుత్వం నుంచా నేను బహుమతి అందుకొనేది!' అన్నాడు. అటు యావత్ప్రపంచాన్నే గడగడలాడించగల చక్రవర్తి బహుమతి, ఇటు హిందూ

దేశంలోని ఓమారుమూల పల్లెటూరి కవి తిరస్కృతి¹ అతని ఆత్మగౌరవాన్నీ దేశంలో అంతర్గతంగా ఉన్న ఐక్యభావాన్నీ వేనోళ్ళ చాటుతుంది ఈ సంఘటన. దేశాన్ని ముంచెత్తి అప్పుడే బలం పుంజుకుంటున్న జాతీయతావాదం వళ్ళత్తోళ్‌ని ప్రభావితుణ్ణి చేసింది. తనదేశం గత వైభవంపట్ల అతని విశ్వాసమూ ప్రగాఢ భారతీయ తత్వమూ వళ్ళత్తోళ్‌లో జాతీయభావంగా రూపుదిద్దుకున్నాయి. స్వతంత్ర సమర వీరగాథలోని ప్రతి ప్రముఖ సంఘటకీ అతనిలో హృదయపూర్వక ప్రతి స్పందన కనబడుతుంది. స్వేచ్ఛాప్రవృత్తిని రేకెత్తిస్తూ ఎన్నో పద్యాలు రాశాడు మలయాళ ప్రజ మహోత్సాహంతో స్వతంత్ర సమరంలో ముందంజ వేసిందంటే అతని కలంలోని జాతీయభావ ప్రబోధం వల్లనే.

కవిత తర్వాత వళ్ళత్తోళ్‌కి ప్రాణపదమైంది కథకళి నృత్యం. గత వైభవం స్థాయికి ఆకళని మళ్లీ తీసుకురావాలని అతను కలలు కనేవాడు. కథాకళి ప్రదర్శకు. లకి శిక్షణాలయం ఒకటి స్థాపిద్దామని రాత్రింబవళ్లు కృషిచేశాడు. 1930 లో కేరళ కళామండలం స్థాపించబడింది. కథాకళి అంటే చెవికోసుకునే మానాకులం రాజా తన భవనంలో అందాకా ఆ పాఠశాలని పెట్టుకో నిచ్చాడు. కళాభిమానుల్నుండి వళ్ళత్తోళ్ బాగానే వసూలు చేశాడు. సమర్థులైన గురువుల్ని నియమించాడు పాఠ శాల పని పర్యవేక్షిస్తూ గంటలకొద్దీ అక్కడ గడిపేవాడు కథాకళి సాహిత్యంలో విద్యార్థులకి మంచి పునాది కల్పించేందుకు గొప్పపండితుడూ, విమర్శకుడూ తన స్నేహితుడూ అయిన కృష్ణమరార్‌ని నియమించాడు. కళామండలం బృందంచేత దేశవిదేశాల్లో ప్రదర్శనలు యిప్పించి వసూలయిన సొమ్ము పాఠశాల భవననిర్మాణం కోసం జమచేసేవాడు. కళామండలం 1937 లో చేరుతురుత్తిలోని స్వంత భవనానికి మారింది. అప్పటికే ఆ సంస్థ ఎంతో పేరుతెచ్చుకుంది. దేశంలోని పలుప్రాంతాల నుండే కాక విదేశాలనుండికూడా విద్యార్థులు వచ్చేవారు. కథాకళితోపాటు ఇతర కేరళ నృత్యాలకికూడా అక్కడ శిక్షణ యిచ్చేవారు. 1939 లో వళ్ళత్తోళ్ తన బృందాన్ని శాంతినికేతన్ తీసుకెళ్ళేడు. ప్రదర్శనానంతరం టాగూరు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది: "అసలైన భారతీయ నృత్య సంప్రదాయం స్మృతికూడా కరువైన ఈరోజుల్లో, ఉత్తరాది వాళ్ళం, మాకీ మహత్తర నృత్యనాటిక చూపించారు, గగుర్పొడిచే అనుభూతి కలిగించారు" పురాతన నృత్యరీతిని పరిరక్షించే ప్రయత్నం చేస్తున్నందుకు ఆయన వళ్ళత్తోళ్‌ని అభినందించారు. వళ్ళత్తోళ్ కళామండలాన్ని కట్టుదిట్టమైన పునాదిమీద నిర్మించాడు. శిక్షణలో మంచి క్రమశిక్షణ ఏర్పరిచాడు. దేశదేశాల దృష్టిని ఆకట్టుకొనేలా సంస్థను తీర్చిదిద్దేడు. 1941 లో రాష్ట్రప్రభుత్వా

వికి అప్పగించారు. కథకళి మళ్ళీ కళకళలాడుతోంది. అసంపూర్ణ పని యిప్పుడు మూడుపువ్వులు, ఆరుకాయలుగా ఉంది. కథాకళిని పునరుద్ధరిద్దామని వళ్ళత్తోళ్ కృషి చేస్తున్న మొట్టమొదటి రోజుల్లో కొందరు పెద్దమనుషులు 'ఈ అవశేషాన్ని పురావస్తు ప్రదర్శనశాలలో అలంకరించడం మంచిదని శలవిచ్చారు. వళ్ళత్తోళ్ ధర్మమా అని ఆ అవశేషం యిప్పుడు కొత్త ఊపిరి పోసుకుంది, విశ్వరూపం దాల్చింది, విశ్వ విహారం చేస్తోంది!

తక్కిన విషయాల్లో ఎంతగా తలమునిగినా కవిత్వాన్ని మాత్రం ఎప్పుడూ చిన్నచూపు చూసి ఎరగడు వళ్ళత్తోళ్. 1930 తర్వాత సాహిత్యమంజరి నాలుగు సంకలనాలూ వెలువడ్డాయి విషక్కన్ని, దివాస్వప్నం, వీరశృంఖల అనబడే లఘుకావ్యాలుకూడా వచ్చేయి. 1941 లో వచ్చిన అచ్చానుమ్ మాకలుమ్ (తండ్రి తనయా) అనే అతని కావ్యం పలువురి మన్నన లందుకుంది. ఇలాంటివి కొన్ని మినహాయిస్తే తర్వాత వచ్చిన అతని కృతుల్లోని పద్యకల్పనలో కొంత కుంటుతనం కనబడుతుంది 1940—50 ప్రాంతాల్లో వచ్చిన అతని కవితకి వామపక్ష రాజకీయ స్పృహ దోహదం చేసింది. ఇండియాయుతే కరాచిల్ (ఇండియా కన్నీళ్లు) వళ్ళత్తోళ్ రష్యాయిల్ (రష్యాలో వళ్ళత్తోళ్) అనే సంకలనాలు అతని యీ దృక్పథాన్ని సూచిస్తాయి.

ఆ ప్రాంతాల్లోనే వళ్ళత్తోళ్ ఎన్నో అనువాదాలు తీసుకువచ్చాడు. 1937 లో కాళిదాసు శాకుంతలమ్ అనువదించాడు. నలభై ప్రాంతాల్లో 12 వ శతాబ్ది సంస్కృత కవి వత్సరాజు రాసిన నాలుగు నాటికల తర్జుమాలు వెలువడ్డాయి. ఆ నాలుగూ యివీ: కపటకేళి, కర్పూరచరితం, రుక్మిణీహరణం, త్రిపురదహనం. 1951 లో తిరువాన్కూరు విశ్వవిద్యాలయం క్షేమేంద్రుడి బోధిసత్వపాదన కల్పలతకి వళ్ళత్తోళ్ మలయాళం కూర్పు ప్రచురించింది. 1952 లో హాలగాధసప్తతి గ్రామ సౌభాగ్యం అనే పేరున అనువదించబడింది. క్రీస్తువెనక ఒకటో శతాబ్దానికి చెందిన హాలుడు దాని రచయిత. డబ్భై అయిదేళ్ళ వయసులో ఋగ్వేదం మలయాళంలోకి తీసుకొచ్చే బృహత్కార్యం నెత్తిన పెట్టుకున్నాడు వళ్ళత్తోళ్. 'వెనుకపడిన వర్గాలకి వేదాలు చెప్పితీరాలి' అనే వివేకానందుడి ప్రవచనం మనసులో మెదులుతూ ఉండి యీ కఠినమైన కృషికి పురికొల్పింది అతన్ని. ఈ పనికి రెండేళ్లు పట్టింది అతనికి. వేదపండితులు యీ అనువాదాన్ని పూర్తిగా ఆమోదించక పోవచ్చు. ఇది మలయాళంలో చిరకాలం మిగిలిపోయిన లోటుని పూడ్చిందనడం మాత్రం నిర్వివాదం.

అతని ప్రముఖ రచనల ప్రచురణ నాటినుంచీ వళ్ళత్తోళ్ బహుముఖంగా మన్ననల నందుకున్నాడు. 1919 లో కొచ్చిన్ మహారాజా అతనికి 'కవితిలక' బిరుదు యిచ్చారు. 1928 లో 'కవిసార్వభౌమ' బిరుదు ప్రదానం గావించిందీ ఆయనే. 1948 లో మద్రాసు ప్రభుత్వం నలుగురు ఆస్థానకవుల్లో ఒకవిగా అతన్ని గుర్తించింది. కేంద్ర సాహిత్య ఎకాడమీ సభ్యుడిగానూ కేరళ సాహిత్య ఎకాడమీ ఉపాధ్యక్షుడిగానూ వళ్ళత్తోళ్ పనిచేశాడు. 1955 లో భారత ప్రభుత్వం అతనికి 'పద్మభూషణ్' పురస్కారం యిచ్చి గౌరవించింది. వీటన్నిటికంటె అతనికి ప్రీతి పాత్రమైనది మరొకటుంది. అది అభిమాన పాఠకులు అతన్ని ప్రేమతో పేర్కొనే పదం, 'మహాకవి' అనేది.

మంచి వృద్ధాప్యంలోకూడా మహచురుగ్గా ఉండేవాడు వళ్ళత్తోళ్. 1950 లో, అంటే అతని వయసు 72 ఉన్నప్పటి మాట. వార్సాలోని శాంతిసమావేశానికి హాజరయ్యాడు. అతనికి ఆంగ్లంగాని మరో పాశ్చాత్య భాషగాని రాదు. అయితే నేం వార్సాలో తన పద్యం ఒకటి చదివి వినిపించడానికీ పారిస్ విశ్వవిద్యాలయంలో పరిమిత ఆహూతుల సమక్షంలో కథకళి గురించి మాట్లాడ్డానికీ యివేం అడ్డు రాలేదు. తరువాతి కొద్దియేళ్ళలో రష్యా చైనాలు సందర్శించాడు. చైనా మలయా సింగపూర్‌లకి కథాకళి బృందాన్ని నడిపేడు. ఇంటికి చేరితేమాత్రం, ఒక్కక్షణం ఊరికే ఉన్నాడా అని! సాహిత్య సభలతో నిరంతరం నిత్యకళ్యాణం పచ్చతోరణం. సమస్త కేరళ సాహిత్య పరిషద్‌తో సాన్నిహిత్యం సరేసరి . 1946 లో దానికి అధ్యక్షుడై ఓ దశాబ్దంపాటు మకుటంలేని మహారాజులా ఆ పదవిని నిర్వహించాడు. సంస్థ వార్షిక సమావేశాల్లోని అతని ఉపన్యాసాలు గ్రంథస్థం అయాయి. చిక్కని వచనశైలీ విశ్వజనీన సాహితీ స్పృహాగల ఆ ఉపన్యాసాలు ఆడుతూ పాడుతూ హాయిగా చదువుకోవచ్చు.

13-3-1957 న, డబ్బై తొమ్మిదోయేట వళ్ళత్తోళ్ మరణించాడు. నిండుగా బతికిన జీవితం అతనిది. నవ్వుతూ గడపిన బలీయమైన వ్యక్తిత్వం అతనిది. నిరంతరకృషి పలిపిన పాటవం అతనిది. అతనూ, అతని కవితా మన సంప్రదాయ సంస్కృతి మూలశక్తికి మచ్చుతునకలు.

## రెండో ప్రకరణం

# సంప్రదాయవాది

19 వ శతాబ్ది చివర్లో ఏక్కడో కేరళలో ఓ గ్రామంలో పుట్టినవాడూ, ఆంగ్లవాసన ఏమాత్రం సోకక అచ్చంగా సంస్కృతంలోనే చదువుకున్నవాడూ సంప్రదాయవాదికాక మరేమౌతాడు ? పరస్పర విరుద్ధభావాల తాకిడికీ అంతర్గత వేదనల అలజడికీ అతను లోనయ్యే అవకాశం ఉండదు. పాత విలువలూ పాత ఆలోచనా ధోరణులూ — యివి అయితేనే అతనికి నల్లేరుపై బండి నడకలా ఉంటుంది. వళ్ళత్తోళ్ అదిగో అటువంటి సంప్రగాయవాది. ఒకరి విమర్శతో ప్రమేయం పెట్టుకోని సామాన్యమైన సంప్రదాయవాది. దానికి కారణం ఉంది. ఎంత దృఢవ్యక్తిత్వం కలిగిఉన్నా కేరళసాహితీసంస్కృతులు భారతీయ మత సంస్కృతీరీతుల్ని తలదాల్చినవే.

12 వ శతాబ్దినుండి మలయాళ కవితలో ప్రధాన భాగం 'మణిప్రవాళం' శైలిలో ఉండేది. సంస్కృతం మణులూ మలయాళం పగడాలూ ఏర్చికూర్చిన భాషా 'సూత్రం' అది. నిజానికి మణిప్రవాళం మలయాళమే, ఎన్నో సంస్కృత పదాల్ని మలయాళం 'సహజం చేసుకుంది'. అయితే ఎన్ని సంస్కృత పదాలకి ఎన్ని మలయాళ పదాలు కలిశాయి అనేది కవి కవికీ మారుతుంది. టొత్తిగా సంస్కృత పదాలు వెయ్యక మలయాళంలోనే పేజీలకి పేజీలు నింపుకుపోతే కృత్రిమంగా కనబడుతుంది. సందర్భోచితంగా సవ్యమైన స్పష్టమైన మృదుమధురమైన మలయాళ పదం వెయ్యడంలోనే కనపడేది వళ్ళత్తోళ్ మెళుకువ అంతా. అలాగని సంస్కృతం వాడడనికాదు. పరుగులుతీసే గేయకవితలోకూడా సంస్కృత పదాలు దండిగా గుప్పించేవాడు. మాటవరసకి మలయాళ సారస్వతం గొప్పతనం వివరించే ఎంతేభాష (నాభాష) అనే అతని కవితలో సంస్కృతపదాల సంఖ్యదే పైచెయ్యి. అయితే ఈ పదాలు అతని వైదుష్యం వెల్లడించేవి, మలయాళీకరింపబడినవి

మాత్రం కావు. అతను ఉపయోగించే వాటిలో మత, వేదాంతపరమైన పదాలు చాలా కనపడతాయి. ధర్మం, కర్మ, యోగం, ముక్తి, మోక్షం, నిర్వాణం, నిర్వృతి, వ్రతం, దమం, శమం, సచ్చిదానందం, పరమాత్మ—యిలాంటి పదాలు కోకొల్లలు. భారతీయ భావనని ప్రతిబింబించే యీ పలుకుబళ్ళకి ఆంగ్లసమానార్థకాలు దొరకడం ఏమంత సులువుకాదు. అతని కవిత బాహ్యస్వరూపం సంప్రదాయ మూలసూత్రాలపై నిర్మించబడిందని చెప్పడం అతిశయోక్తి కాదు.

పురాణగాథల సాహితీ సంపదగల భారతదేశం వళ్ళత్తోళ్ కవితకి ఓ ఆసరా అతని కవితానిర్మాణాకృతికి ఓ నేపథ్యసీమ. అతని పద్యాల్లోని కథావిషయమూ, ప్రధాన పాత్రలూ చాలవరకు పురాతన గాధలనుంచి సేకరించినవే. అతని అనిరుద్ధన్ కథ అందరూ ఎరిగిందే, శ్రీకృష్ణుడి మనవడు అనిరుద్ధుడు రాక్షసరాజు కూతురు ఉషని వెళ్ళాడ్డం. 'శిష్యానుమ్ మకానుమ్' లో శివుడూ పార్వతీ గణపతీ సుబ్రహ్మణ్య స్వామీ పరశురాముడూ రాధాకృష్ణుడూ - యివీ పాత్రలు కథాస్థలం కైలాసం కథపురాణ సంగ్రహితం. 'ఒరు చిత్రం' (ఓ బొమ్మ) శ్రీ కృష్ణుడి కమనీయ చిత్రణ. 'అంపదియల్ చెల్లుణ్ణ అక్రూరన్' భాగవతంలో ఓ కథ. కృష్ణుణ్ణి మధురకి తీసుకు వెళ్ళడానికి అక్రూరుడు బృందావనం వెళ్ళడం ఇందులో ముఖ్య సంఘటన 'కర్మ భూమియుతే పించుకళ్' (కర్మభూమి మృదుపదాలు) అనే కవితలో కాళీయ సర్పం మీద కృష్ణ నృత్యం వర్ణించబడింది. 'అచ్చానుమ్ మాకలుమ్' (తండ్రీ తనయా) విశ్వామిత్రుడూ అతని కూతురు శకుంతలా కలయిక మీద ఓ ఊహా కల్పన. 'కిలి క్కొంచళ్' అనే కవిత అయిదేళ్ళ సీత తోటలో ఆట వివరిస్తుంది. 'ఏ మోతిరమ్' (ఆ ఉంగరం), 'భక్తియుమ్, విభక్తియుమ్' (భక్తీ, పాండిత్యమూ) 'మలయాళతింతే తలా' (కేరళ శిరస్సు) అనే రచనలు కేరళ గాధలపై ఆధారపడి రాసినవి. పూర్వగాధలమీద ఆధారపడకుండా రాసినవి కొన్ని లేకపోలేదు. అయితే వాటిలో పాత్రలూ సంఘటనలూ చిత్రణలూ అన్నీ పురాతన గాధలనుంచి తెచ్చుకున్నవే. అన్నీ మతప్రవృత్తి గలవే. 'ఎంటె గురునాథన్' (నా గురువు) అనే పేరుతో గాంధీమీద చెప్పిన కవితలో వళ్ళత్తోళ్ అంటాడు.

గీత జన్మించిన సీమ మాత్రమే
కర్మవీరునికి జన్మభూమియగు.
హిమగిరి వింధ్యల నడుమదేశమే
విగ్రహమెరిగిన కేసరి సరియగు.

తల్లి గంగచే తడిసిన భూమే
కల్పక తరువుకు కన్నతల్లియగు.

'పాపమోచనమ్' అనే మరో రచనలో గాంధీలో అతనికి విశ్వామిత్రుడి కఠిన వైరాగ్య విరతీ, జనకుడి కర్మయోగ లక్షణమూ, భీష్మడి ధర్మయుద్ధ పరాక్రమమూ, హితమైన సలహా యివ్వడంలో విదురుడి నేర్పరితనమూ గోచరించాయి. వీరందరూ ఆకాశసీమను అలంకరించిన దేవమునులు. నీలిరంగు ఆకాశంలో రెపరెపలాడుతున్న మువ్వన్నెల జెండా రెప్పవాల్చకుండా చూస్తూ తన 'పోరా పోరా' (చాలదు, ఇంకా చాలదు) అనే కవితలో కవి యిలా అంటాడు :

నీలి కృష్ణుని ఎదను పులకరించెను పూలు
దేవమునులకు అటులె సుకము నిచ్చిన చాలు

'మగ్దలిన మరియమ్' (మేరీ మేగ్డలిన్) లో క్రీస్తు అతనికి కృష్ణుడిలా కనిపించాడు. అందులో సందేశం ఏమిటంటే :

సాటి ఎరగని మధుర శ్రావ్యమా రవళి
క్రీస్తుయే కృష్ణుడై సవరించె మురళి

భారతీయ పాండిత్యంలో అంత నిష్ణాతుడైన కవికి హిందూవేదాంత తత్వసారం తలకెక్కడం సహజమే. కాని వళ్ళత్తోళ్ వేదాంతి కాదు. ఇదమిత్థమని తేల్చలేని వేద, ఉపనిషత్తుల ప్రపంచం కన్నా పురాణ, ఇతిహాసాల్లో చెప్పబడిన జనసమ్మర్దంగల జగన్నాటకమే అతనికి సన్నిహితమూ పరిచితమూ. అలాగని ఉతని కవితలో అద్వైత వేదాంత ప్రభావం లేదనలేము. అది ఒక్కొక్కప్పుడు స్పష్టంగానూ మరొకప్పుడు అస్పష్టంగానూ కనబడుతుంది. సమానత్వం ఐక్యతా భావం అనే అతని అభిప్రాయాలు అన్ని జీవులూ ఆ భగవంతునిలో ఐక్యమౌతాయనే విశ్వాసంలోంచి పుట్టినవే. అతని 'ఒనప్పూతవ'లో సూర్యుణ్ణి 'మూర్తీభవించిన జ్ఞానమా!' అని సంబోదిస్తూ యిలా అంటాడు :

పూజారి పూల పళ్ళెమయినా
జాలారి వంట కుండయినా
సమంగా 'ముద్దిస్తాయి' నీ కిరణాలు
సహజంగా అవి అతి పవిత్రకరాలు

'అద్వైతం శివం శాంతం' అనే మరో కవితలో వరదలతో కరువు పాలైన కేరళ దుస్థితి వర్ణిస్తాడు. ఉన్నవాళ్ళనీ లేనివాళ్ళనీ ప్రకృతి ఒకే అవస్థకి గురిచేసిందనీ, పెద్దకులం వాడైనా పేదకులం వాడైనా ఓలాగే బాధపడ్డాడు గనక ఒకరిమీద మరొకరి ఆధిక్యత లేదనేది యీ విధంగా కనువిప్పు అయిందనీ వివరిస్తాడు. ఈ గుణపాఠంవల్ల దేశం బాగుపడాలనీ పణిక్కర్ మాతృదేశమైన కేరళ సుఖశాంతులతో వర్ధిల్లేస్థితికి ఎదగాలనీ విన్నవిస్తాడు. అతని కవితలో యిలాంటి భావాలు తరచుగా తారసపడతాయి అంతేకాదు. కులతత్వమనే ఆపదనుంచి తప్పించి సంఘాన్ని సంస్కరించాలనే అతని కోరికకూడా సంప్రదాయస్వభావసారం నుంచే గ్రహింపబడడం గమనార్హం.

సంప్రదాయవాదీ ఉద్గ్రంథకర్తా అయిన కవికి హిందూస్వభావానికి నైజమైన ఆవేశలక్షణాలూ జీవన దృక్పథాలూ ఉండడం సహజం. శతాబ్దాల శిక్షణవలన భారతీయ తత్వంలో జీర్ణించుకుపోయిన భక్తిభావన అతనిలో ఓ నైజగుణంగా కనిపిస్తుంది. 'ఒరు చరితమ్' 'అంపనియల్ చెళ్లన్న అక్ర్యారన్' భక్తియుమ్, విభక్తియుమ్' మొదలైన అతని కృతుల్లో యీ రీతిరివాజులు భారతీయ సాహిత్యంతో ఏమాత్రం పరిచయం ఉన్నవారికైనా గోచరిస్తాయి. 'ఒరుచరితమ్' అనేది కృష్ణుడి మీద తన్మయత్వంతో చేసిన ఓ వర్ణన. ఆ మృదుమధుర పదకల్పనా, ఆభక్తి భావనా మనల్ని కదలిస్తాయి. పాలుసితుకుతున్న వాళ్లమ్మని అనుకున్న చిన్నికృష్ణుణ్ణి కవి ఎలా పలకరిస్తున్నాడో చూడండి :

తల్లివి ఆనిన ఓ కృష్ణయ్యా!
తల్లీ దంశ్రీ నీవె గదయ్యా!
అడపా తడపా పుడమిని వుడుతూ
చెడు ఖండిస్తావ్ మంచి వింపుతావ్
పాలో వెన్నో కాజేద్దామని
గోపిక రాకలు పసిగడుతుంటావ్
త్రిలోకాలకూ సరిపడు పదముల
త్రిస్థాయిలలో నృత్యం చేస్తావ్

పశువాలుడిగా పైకి తోచినా
ఏలే దొరవని మా కెరుకేలే!
రక్షణయిచ్చే రాజవిరాజా!
నల్లవిసామీ, నమస్సు లివిగో.

'అంపదియల్ చెళ్లణ్ణ అక్రూరన్' లో అక్రూరుడికి కృష్ణుణ్ణి ఇలా చూపిస్తాడు కవి, 'ఇదిగో చాతకం, నువ్వెదురు చూస్తున్న నీలమేఘం ఇదే'. ఆ తర్వాత హృద్యమైన వర్ణనలో పడతాడు.

నందుని నట్టింట హరి వెలిగించిన
అఖిల అందాల దివ్వె ఇదే
ఆ యశోదకు గుండెనిండుగా మెరిసిన
నిగనిగల నీలాల రవ్వ ఇదే
గోపికాలతలలో కులుకుతూ గెంతిన
చిన్నారి పొన్నారి నెమలి ఇదే
వయ్యారి యమునపై ఉయ్యాల లూగిన
నల్లని అల్లరి హంస ఇదే
వెట్టి గొల్లల బతుకు వెన్నెల చేసిన
మరువని మాయని నేస్తమిదే
వేదాలు చదివిన విద్వాంసు లెరిగిన
విశ్వ రహస్య సర్వస్వ మిదే.

తాను పూజించే మాతృభూమి గురించి రాసినా తను ప్రేమించే ఓ నది, కొండ గురించి రాసినా, తను గౌరవించే ఓ గొప్పవ్యక్తి గురించి రాసినా ఇదే స్థాయిలో సన్మానిస్తాడు వళ్ళత్తోళ్. గాంధీని గురించిన పద్యాల్లో అతని భక్తిభావన అతిశయోక్తి అనిపిస్తుంది. వైక్కం సత్యాగ్రహంలో గాంధీ అవతరణ కవి కిలా కనిపించింది:

తొలిపొద్దు దూరాన తొంగి చూసింది
చెంపపై మురిపాన కెంపు పూసింది
ఆకాశస్థలినుండి మంచు ఒలికింది
ఆనందభాష్పాల అవని కులికింది

కొత్త బుద్ధుని చూడ కోర్కె కలిగింది
కనులు పూర్తిగ విప్పి కాంతి నింపింది
రూపు దాల్చిన వెలుగు ఎదుట నిలిచింది
గురుపాద దర్శన భాగ్య మమరింది

అయితే అది క్షణం మాత్రమే. ఆ విచారం యిలా వెళ్ళబోస్తాడు :

పడిపోదమన్నను పాదాలముందు
దొరకదే జనములో రవ్వంత సందు !
కాశీ ప్రయాణమ్ము కుదిరిందిగానీ
గంగలో మునిగేటి వైభోగమేదీ ?

వినయం, ప్రశంసా, గౌరవం, అభిమానం—యిలా ఎన్నో భావాలు కలుస్తేనే భక్తి అవుతుంది. అది మనం భక్తిభావనతో చూసేవారిని ఓ అందాల కుప్పగా ఓ సుగుణాల రాశిగా గోచరింపజేస్తుంది. ఇలా స్వరూపం మార్చే లక్షణం వళ్ళత్తోళ్ పద్యాలకి నైజగుణం.

సంస్కృత కవితలలోనూ పురాతన మలయాళ కవితలోనూ భగవదారాధనతో పాటు జీవితంపట్ల గాఢమైన ఆనందానురక్తి కనిపిస్తుంది. బొత్తిగా విరాగులూ పరిశుద్ధవాదులూ తప్పితే భారతీయ తత్వాన్ని విశదీకరించే నైజలక్షణాలు కొన్ని ఉన్నాయి. జీవితంపై ప్రగాఢ సుఖాసక్తీ, ప్రకృతి సౌందర్యంలో ప్రత్యేక ఆనందానుభూతీ, పరిచయాలపట్ల ఉత్సాహమూ – ఇలాంటివి. భాసుడూ కాళిదాసూ మొదలైన పూర్వకవుల్లో అయితేనేం టాగూరులాంటి ఆధునిక కవుల్లో అయితేనేం పరిమిత పరిధిగల వళ్ళత్తోళ్ లాంటి కవుల్లో అయితేనేం రకరకాల హెచ్చుతగ్గుల్లో యీ లక్షణాలు కనబడుతాయి. వళ్ళత్తోళ్‌లోని విషయానురక్తి భారతీయ కవితా వాహినిలో ఓ పాయగా కనబడుతుంది. మలయాళ కవితలో యీ విషయానురక్తి ఎప్పుడూ ఉంది. చెరుస్సేరి, కుంచెన్ నంబియార్ తర్వాత ఓ గొప్పకవిలో ఆ భావం రూపుదిద్దుకోడం వళ్ళత్తోళ్ లోనే. 'ఓ సాయంకాలపు షికారు' అనే కవితలో ఆతను అంటాడు .

లోకమా ! నువ్వెంత శోకమయమయినా
ఇన్నిన్ని అందాలు ఇలనిండ ఉండగా
విన్ను కాదనుగుండె నిజముగా ఉండునా ?

ఈ మనోహర దృశ్యాల ఆరాధన అతని కవిత అంతటా కనిపిస్తుంది. ప్రకృతి సౌందర్యంలో అతని కవితకి ఓ ఆధారం దొరుకుతుంది :

తియ్య తియ్యగా గానం చేసే కోయిల గొంతుకలో
వయ్యారంగా నాట్యంచేసే తీగెల కదలికలో
ఓ కవితా ! నువు కనిపిస్తావ్ !
అమృతమయమౌ విలాసయుతమౌ పువ్వుల నవ్వులలో
ఓ కవితా ! నువు కనిపిస్తావ్ !
చక్కని ఉదయం సరియగు అందం
ఓ కవితా ! లేదనిపిస్తావ్ !

మూలంలోని అతని కొన్ని శృంగార సూచనలు యీ అనువాదంలో మరుగున పడ్డాయి. అతని ఆదర్శవాదం మాట ఆటుంచి వళ్ళత్తోళ్ మూలగుణంగా ప్రాపంచి కత కనిపిస్తుంది, అది అతని ప్రకృతి కవితలో నాజూకుగా చెప్పబడుతుంది.

విర్మోగమాటమైన శృగారవర్ణన సంస్కృతంలోనేగాక మలయాళ కవితకి కూడా నైజలక్షణం. పైపై అందాలకు స్పందించే కామోద్రేకంగా ప్రేమ అనేది సూక్ష్మీకరించబడింది. అందుకనే చాలామంది కవుల్లో స్త్రీ శరీరాన్ని వివరంగా విశ దంగావెయ్యి విధాలుగా వర్ణించడం కనబడుతుంది. వళ్లత్తోళ్ యీ సంప్రదాయానికి చెందినవాడు. అతని పద్యాలలో యిలాంటి ప్రేమే కనబడుతుంది. స్త్రీ శరీరాన్ని పెద్దలు చెప్పినట్టు వర్ణించడమంటే అతనికి యిష్టం మేఘాలలాంటి నల్లటి కేశా లకీ, విశాలమైన నల్లటి నేత్రాలకీ, చంద్రుడిలాంటి పద్మంలాంటి ముఖాలకీ, గుండ్రని పాలిండ్లకీ అతని రచనల్లో ఎక్కడా లోటు కనిపించదు. సంధ్య అనే ఓ కవితలో నమాజు చేసుకుంటున్న ఓ తురక వనితని వర్ణిస్తూ పాఠకుడి దృష్టి ఆమె అంద చందాలవైపు మరలించేలా పదేపదే ప్రయత్నిస్తాడు కవి అరికాళ్లు ఆమె పిరుదుల్ని తాకేయనీ, ముత్యాల చేతులు ఆమె మోకాళ్లను మూసేయనీ - యిలా నడుస్తుంది బండి. పురాతన బాణీలో ఉన్న రూపకల్పనలూ పద్ధతులూ అతన్ని పూర్వసంప్ర దాయ శృంగార కవుల్లో చేరుస్తాయి. 'నా కవిత', 'రావణుని అంతఃపుర ప్రవేశం' అనే అతని కవితలు వస్తువులో రీతిలో వేరు అయినా జీవితంపట్ల రచయితకు గల విషయానురక్తికి గీటురాళ్లుగా నిలుస్తాయి. 'కవిత' తో అతను అంటాడు :

యోధవరుని చేతికత్తి ఊపులోని తళుకులలో
లేడికళ్ల సొగసులాడి లేతవలపు చూపులలో

అలసి ఉన్న పసిబాలుని చిరుబుగ్గల చిత్తడిలో
కవితా ! నీ కమనీయాకృతి
కన్నుల కనుపట్టును సుమీ !

ఇంకో కవితలో తనకి ఎదుటపడే స్వాగత దృశ్యాన్ని రావణుడెలా వివరిస్తాడో చూడండి .

ఆదిగదిగో నా ముందర
కుందనాల కుందెలలో
వందలాది దీపాలు.
చేతులలో జ్యోతులతో
అందమైన రూపాలు.
చిక్కని చనుదోయితో
చక్కని నగుమోముతో
బతుకే తొలిముద్దుగా
నిశనే నడిపొద్దుగా
మార్చివేయు జాణలు
.... .... ..
అదిగదిగో ఆ చిన్నది
వీణియ సవరిస్తున్నది
పిరుదులు కదలాడ వెలది
శ్రీగంధం తీస్తున్నది
ఇంతింతలు కనులున్నది
సుర సిద్ధం చేస్తున్నది
. ..
మండోదరి ఉండేదరి
లంకాపురి కేదీసరి ?

భక్తి శృంగారమూ ఇవి రెండూ ఎదురెదురు భావాలు. ఇటు అసలైన విరక్తి. అటు విషయానురక్తి. అయితే సనాతన నాగరికతలోంచి పుట్టిన సంస్కృత కవిత. ఈ విభిన్న దృక్పథాలను కలిపి ఏకజాతీయమైన పరిపూర్ణత సాధించింది. వళ్ళ శ్లోకంలో కూడా ఈ సనాతన నాగరికత అంతర్గత విధానాల విగ్గు బయటపడుతుంది.

కావ్యరచనా శిల్పంలో వళ్లత్తోళ్ ఎంతోకాలం కృషిచేశాడు. అత్యున్నత కళాభిజ్ఞత కనిపిస్తుంది అతని కవనంలో. ఆరచనలోని బాహ్యప్రకృతులు, అంటే, సంస్కృతపదాలు చేరిన వాక్సరణీ, సంస్కృత ఛందస్సు వాడడంలో సౌలభ్యమూ ఇలాంటివి అతని ప్రతి పద్యంలోనూ దర్శనమిస్తాయి ఇవేకాదు. చాతకపక్షీ జలధరమూ, సూర్యుడూ పద్మమూ; సాగరుడూ అతని సతినదీ, పుష్పాలంకృతమైన వసంతమూ, లతలు నాట్యం చెయ్యడం, తదనుగుణంగా తీగెలు ముద్రలు పట్టడం, చంద్రుడు నేసిన తెల్లని పట్టూ, పచ్చ తివాసీ పంటపొలాలూ .. యిలాంటి శాస్త్రం నిర్దేశించిన ప్రతివర్ణనా కనపడి తీరుతుంది. అతని కావ్యతత్వానికి మరో బలమైన సాక్ష్యం అతని పద్యాల్లో ఉపయోగించబడిన శయ్యా ఛందోరీతులు ఇంచుమించు నిర్దోషంగా ఉండడం. అతని కవితలోని ఈ విశేషాల్ని ఎత్తిచూపడం ఏ అనువాదం తరమూకాదు. 'శిష్యానుమ్ మకానుమ్'లో ఏ పద్యమైనా, 'కిలిక్కొంచల్' 'ఒరుచిత్రమ్' 'భారత స్త్రీకల్ తాన్ భావశుద్ధి' లలో ఏ గద్యమైనా చూడండి. శబ్దార్థలయలు ఎంత నిర్దోషంగా సంలీనం అవుతాయో, ఏమాత్రం తేడాలేకుండా ఎంత బాగా పదాల ఎంపిక జరుగుతుందో తెలుస్తుంది. కొన్ని ఉత్తమ భాగాలు ఉదాహరణగా చూపడం కాదిది. సహజసిద్ధంగా అతని కవిత్వతత్వమే అంత. సందర్భానుసారంగా తూచినట్టు పదం వేయగల గొప్ప నేర్పులో ఆధునిక కవుల్లో వళ్లత్తోళ్‌కి అతనే సాటి. గ్రంథ విస్తీర్ణతనిబట్టికూడా అతనొక కావ్యకర్త అని చెప్పవచ్చు కేవలం పదాడంబరంతో అతను పద్యాన్నెప్పుడూ నింపడు. పదాల వాడుకలోనూ రూపకల్పనలోనూ వర్ణనలోనూ అతను పొందేది ఒక మధురానుభూతి. అతను తన కవితకిచ్చేది స్థిరమనోహరాకృతి. చాలావరకు అతనివి లఘుకృతులు. కాని ఆ స్వల్పరూపంలోనే అనల్పమైన సంపూర్ణాకృతి గోచరింపజేస్తాడు. పలురకాల రూపకల్పనలూ, ప్రత్యేకించి ఉపమానాలూ విశదమైన విషయవర్ణనలూ ఈ అనుభూతి కలిగించడానికి కారణాలు.

మహాకావ్య రచనకి దృఢవిశ్వాస మన్నది మూలాధారం. ఆ విశ్వాసం సంప్రదాయకమైనది. ఆ విలువలూ దృక్పథాలూ సంప్రదాయం ఆమోదించినవి. శతాబ్దాల సాధనవల్ల ఆశైలి రూపుదిద్దుకొంది. ఆ కళాభిజ్ఞతలోని మెళుకువలు ఎంతో క్రమశిక్షణతో ఎన్నో కష్టాలకోర్చి ఎందరో యుగపురుషులు నిర్దోషంగా మలచినవి సనాతన సంప్రదాయం, తదనుగుణమైన కావ్యసృష్టి మలయాళం కవిత ఘనత అని చెప్పవచ్చు కావ్యస్రష్టల వరసలో బహుశా వళ్లత్తోళ్ చివరివాడు కావొచ్చును. కళోత్కర్షలో అతనొక కావ్యశిల్పి. కాలదోషం పడుతున్న యీ సనాతన కావ్య రచనా శిల్పానికి వళ్లత్తోళ్ ఒక ప్రతినిధి, ఒక ఫలశ్రుతి.

## మూడో ప్రకరణం

# జాతీయ కవి

గాంధీ నాయకత్వంలో స్వతంత్ర సమరం బాగా వేళ్లూనుకునే సమయానికి వళ్లత్తోళ్ నలభయ్యో పడిలో పడ్డాడు. శాసనోల్లంఘన ఆరంభంతో ఉద్యమం ఓ కొత్త మలుపు తిరిగింది. ప్రతి భారతీయుడూ పరవశించిపోయాడు. ప్రజావెల్లువ ఉవ్వెత్తున లేచింది. ఈ ఉధృతం దేశం నలుమూలలా పాకింది. అంతవరకూ విశృంఖలంగా విద్రాణంగా గడిపిన వళ్లత్తోళ్ దీనితో నిలువెల్లా చలించిపోయాడు. అంతకుముందు కొన్నేళ్లక్రితం భారత చక్రవర్తిని ప్రశంసిస్తూ 'భారత చక్రవర్తి పంచకం' రాశాడు. రాజభక్తి, ప్రజాధర్మం లాంటి పడికట్టు భావాలకి అంతటితో స్వస్తిచెప్పి గాంధీ యిచ్చిన పిలుపుని హృదయపూర్వకంగా అందుకున్నాడు. దేశభక్తి ప్రబోధకమైన పద్యాలు రాయడం మొదలెట్టేడు.

దేశభక్తి జాతీయతా అనే విషయాలమీద అతను రాసిన పద్యాలు చాలా గొప్పవి. చారిత్రక సత్యాలు సమర్థవంతంగా ఎత్తి చూపినవి అవి. ఉజ్జ్వలాగ్నిలాగే ఉత్సాహదీప్తితో రాసినవి అవి. అందుకే అవి అంతగా పేరు తెచ్చుకున్నాయి. భారతజాతీయతలోని తొలిదశ అతని మాతృభక్తిలో వెల్లడౌతుంది. జాతీయ గీతం చాలావరకు భక్తిగీతం లాగే కనిపిస్తుంది. ఉదాహరణగా బంకిమ చంద్రుడి 'వందే మాతరం' తీసుకుంటే అందులో ఎంతో గాఢానురక్తి వ్యక్తమౌతుంది. కొంచెం ముందూ వెనకా అయినా వళ్ళత్తోళ్ పద్యాలు చాలావరకు యీ కోవకి చెందినవే. 'మాతృవందనమ్' అనే కేరళమీద కవితలో అతని మాతృభక్తి వ్యక్తమౌతుంది. ప్రశంసతో ప్రణామాలతో ఆరంభమౌతుంది అది :

అమ్మకి హారతులు
మా అమ్మకి మానతులు
జీవనమిది దీవనలిడు

మా అమ్మకి నమస్కృతులు
సత్రాజితు కా మిత్రుడు
శమంతకం ఇచ్చినట్లు
కడలి పరశు రాము కిడిన
కలికి రత్న మిదే, ఇదే!
అలలరాజు కలలు పండ
ప్రభవించిన లక్ష్మి ఇదే!
శ్రీ కుమారి గోకర్ణులు
ఇరువైపుల కొలుచుచుండ
సైకత స్థలి పదములుంచి
సహ్యగిరుల తల ఆనిచి
విశ్రమించు జనని ఇదే!
అమ్మకి హారతులు
మా అమ్మకి నమస్కృతులు
నరులు గొల్చు సురలయినా
శిరముదాల్చు తల్లి ఇదే!

కేరళవైభవం, దేశభక్తుల కర్తవ్యం వివరించాక యిలా పూర్తవుతుంది అది:

అమ్మమాట అది వేదము
అమ్మ సేవ పరమార్థము
అమ్మకొరకు నైవేద్యము
అయిన బతుకు అతిధన్యము

ఆఖరి రెండు చరణాలూ అతి మనోహరమైనవి:

పుణ్య మాతృభూమి మ్రోల
పుడమివేరు దైవ మేల?

కవి ప్రస్తుతించే కేరళ భారతదేశాలు అందానికి ఆటపట్లు అని మాత్రమే కాదు, అవి పవిత్రతకు నిలయాలు. మహర్షుల బోధనలవల్లా ధర్మపరాయణ జీవన సంస్కృతివల్లా పుణ్యస్థలిగా పేరుపొందినది. అతని దృష్టిలో ఆర్షభారతం అత్యంత

పూజనీయం. దేశమంటే మట్టికాదు, మనుషులు, మహాపురుషులు. వారి గురించి చెప్పడమే దేశం గురించి చెప్పడం అవుతుంది. అదే వళ్ళత్తోళ్ అభిప్రాయం. అతని దేశభక్తికి రాజకీయ ప్రసక్తి ఉండదు. అది మతపరమూ ఆదర్శప్రాయమూ 'నముతే మారుపతి' (మా జవాబు) లో అతను అంటాడు:

భరతావని మా దేశం
మా పూర్వులు మహామునులు
శాంతి వారి ఐశ్వర్యం!
దివ్యజ్ఞాన భాస్కర ద్యుతి
దిశ దిశలా ప్రసరించిన
ఉపనిషత్తు గీతలు మా
సంప్రదాయ సారాంశం!
విశ్వత్రయ మంతటిలో
మాదేశం స్వర్గతమం
మాకు ఇదే కైవల్యం!

'కొచుసీత' (చిన్నారి సీతమ్మ) లో భారతీయ ఔన్నత్యాన్ని ఆకాశాని కెత్తుతాడు:

సంగ్రామ సంరంభంలో అయినా
స్పష్టమైన వైరాగ్యపు పిలుపు
వేటగాడి గుడిసెలో అయినా
సాధుసంపద మేలు కొలుపు
పడుపుకత్తె నివాసంలో అయినా
పవిత్రత గుబాళింపు
ఇదిగో, హిందూదేశం!
నీ ఔన్నత్యం నిజంగా అద్భుతం.

'మలయాళ తింతేతల' (కేరళ శిరస్సు) లో తన శిరస్సును దేవతకు బలి యివ్వడానికి జంకుతున్న కాపాలికతో శంకరాచార్యుడు అంటాడు:

కర్ణుడు!
మన తాతలనాటి నేత
తాతల తలదన్ను దాత

తెలిసినా చర్మము శిథిలమౌతుందని
కవచమిడి చావుకే సిద్ధమైనాడు!
జీమూతవాహనుడు,
ఏనాటివా డతడు!
ఓ పాము బతుకులో పాలువోద్దామని
తాను కాలేదా పక్షి కుక్షికి కూడు!
శిబి సార్వభౌముడు,
చిరకీర్తికాయుడు!
పాప మా పావురము ప్రాణభీతికి కరిగి
ఓడేగ నోటికే ఒడలిచ్చినాడు!

ఇలా ముప్పురు ప్రముఖదాతల్ని వర్ణించి చివర అంటాడు:

ఆ వీరుల బలి ఫలితం ఒక రక్తం మడుగు
మా దేశం త్యాగానికి అది మాయని గురుతు
అచట జనియించుట నా భాగ్యమందు
నూరిపోస్తావేమి ఈ పిరికిమందు?

భారతీయ తపోధనులు వేటికై తే నిలబడ్డారో ఆ అహింస, ప్రేమ, స్వార్థ త్యాగం, సమదృష్టి - సుగుణాల ప్రశంస కనబడుతుంది వళ్ళత్తోళ్ కవిత అంతటా. ఈ అధ్యాత్మిక సంపద అంతా మూర్తీభవించడంచేతే గాంధీ అంటే వళ్ళత్తోళ్కి అంత భక్తి. 'ఎంతే గురునాధన్' (మా గురువు) అనే ప్రముఖరచనలో అతనిలా వివరిస్తాడు:

సకల చరాచర జగతి
స్వగృహ సదృశ మతనికి
గరికో మొలకో క్రిమికీటకమో
ఏదయినా ప్రియ మతనికి.
వినయ మతని ఘనశీలత
త్యాగ మతని గుణసంహిత
యోగసారమైనవాడు
అతడే నా గురుదేవుడు
తారకలే మాలికలై వెలుతురు విరజిమ్మినా

మబ్బులతో తబ్బిబ్బై మనకలు కనుగ్రమ్మినా
ఉట్టిపడదు, ఉలికిపడదు గగనసీమ కొకచేలే!
గంభీరము ఆ ప్రకృతి, గాంధీజీ అంతేలే!

.... .... .... .... .... .... .... .... ....

ఏసుక్రీస్తు త్యాగధనం
శ్రీకృష్ణుని ధర్మగుణం
శ్రీశంకరు జ్ఞానఫలం
బుద్ధుని అహింసతత్వం
రంతిదేవు కారుణ్యం
హరిశ్చంద్రు సత్యవ్రతం
మహమ్మదు సుస్థిరచిత్తం
వెరసి గాంధి వ్యక్తిత్వం

వర్తమానం విషాదకరంగా అంధకారమయంగా ఉన్నప్పుడు ఇంత వెలుగూ ఓదార్పుకోసం గతంలోకి మళ్లడం మనిషికి సహజమే. అయితే వళ్లత్తోళ్ ఇంతటితో ఆగిపోలేదు. గతంలోనూ, గతం వర్తమానంలోకి కొనసాగడంలోనూ అతనికి భవిష్యత్తు అర్థం కనిపిస్తుంది. తరతరాల వారసత్వమే స్వతంత్ర భారతంలోకి అడుగుపెట్టబోతోంది. నైతికశక్తి కలది గనుకనే గాంధీ అంతటివాణ్ణి ప్రభవించ గలిగింది. అలాంటి పురాతన ఆదర్శాల పునాదిమీదనే భవిష్యత్తు నిర్మించబడ నున్నది. 'పోరా పోరా' (చాలదు, ఇంకా చాలదు) అనేది త్రివర్ణ పతాకాభివందనం చేసే విజయోత్సాహ గీతిక. ధర్మపతనానికి వగచే స్వర్గవాసుల్ని ఓదార్చమని అతను పతాకాన్ని అర్థిస్తాడు. పతాక మధ్యన ఉండే రాట్నం చక్రం దుర్మార్గ కంఠం ఉత్తరించే శ్రీకృష్ణ సుదర్శన చక్రమని. ధ్వని.

పరాయిప్రభుత్వం ఆక్రమణనుండి దేశాన్ని విడుదల చెయ్యడం కోసం వళ్లత్తోళ్ ఇంతగా కోరడానికి కారణం ఉంది. పాశ్చాత్య నాగరికత అంటే అతనికి అసహ్యం, అపనమ్మకం, "ఒరు కృష్ణప్ప రుంటినోడు" (ఓ నల్ల గెద్దకి) "నింగళ్ తాన్ పొక్కు విపరీతమాకొళా" (నీ అడుగులు వెర్రితలలు వెయ్యనివ్వకు) అనే అతని కవితల్లో యీ భావం స్పష్టమౌతుంది. అది కృత్రిమమని చెబుతూ పాశ్చాత్య నాగరికతా వ్యామోహితుల్ని అతను అడుగుతాడు :

పడమటి దిక్కున బంగరు మిలమిల
పడగొట్టినదా బాబూ మిమ్ముల?

అది ఆగిపోవు హృదయానికి అంతిమ డోలం
అది అస్తమించు గగనానికి ఆఖరి జ్వాల
పతనమయే పశ్చిమాన సతతము అతి తిమిరము
ప్రతి దినమూ ఉదయమున్న పథముకు పద పోదము

అన్య నాగరికత యిచ్చే అవినీతి ప్రభావంనుంచి దేశాన్ని రక్షించడం కోసమే అతను రాజకీయ స్వాతంత్ర్యం కోరింది. కాని అది కేవలం ఓ తప్పుని పరించడానికే కాదు, అనేక వరమాదర్శం, పారమార్థికం. దాస్యం, అలసత్వం యిలాంటివి నిర్వచించడంలో అతని సంకేతాలు సాధారణంగా ఒకటే; చీకటీ, రాత్రి. 'పరవశ్యమ్' అనే అతని ప్రసిద్ధకవిత యిలా ప్రారంభమౌతుంది :

మాధాత్రి కెప్పుడూ మంచురాత్రేనా ?
తెల్లవారుట మాకు తెలియకేపోనా ?

'కాలం మారి' (మారిందిలేకాలం!) అనే మరోకవితలో రాత్రినీ స్వతంత్రో దయాన పొడచూపే తారనీ అన్యాపదేశంగా ఇలా చిత్రిస్తాడు :

పెనుచీకటి ఆటవికులు ఇక చెల్లాచెదరు
నట్టడవిని చిక్కుకున్న వెలుతురుకిక విడుపు
సుందరనవ భారతమిక సురుచిరమై వెలుగు
తూరుపుదిశ నల్లని తన దారిద్ర్యపు ఉడుపు
సాగరాన పారవేసి సరిగ చీర దాల్చు
బద్ధకమ్ము పరుగుదీయు పరిశుభ్రత విలుచు
కలతపడ్డ మనసుకింత కుదురుపాటు దొరుకు.

స్వతంత్రం యువకుల జన్మహక్కు అని అతని ఉద్దేశం. యువకుల దారి సుగమం చెయ్యడం పెద్దవాళ్ల విధి. 'మా జవాబు' లో అతను అంటాడు :

కంటకాలు తొలగిస్తూ దారి బాగుచేస్తున్నా
ముందు అడుగువేస్తున్నా సూటిదారి పడుతున్నా
గమ్యం నే చేరినా నడుమను కనుమూసినా
అదో పెద్ద తేడాగా అనుకోడం లేదులే !

ఎందుకని ?

నా వెనక యువకుల నాజూకు పాదాలు
నలగకుండా ఉంచె నా కదే పదివేలు

గాంధీ కార్యక్రమాల పట్ల వళ్లత్తోళ్ ఎంతో ఆసక్తి కనపరచేవాడు. ఖాదీ ప్రచారానికి ఇంత ఎక్కువగా తన కవిత వినియోగించిన మరొక కేరళ కవి లేడు. చక్రగాథ (చక్రగీతం) ఖాదివసనాంగళ్ కైక్కోళ్విన్ ఎవరుమ్ (అందరూ ఖద్దరు ధరిద్దురూ!) అనేవి ఒకప్పుడు అందరి నోళ్లలోనూ ఆడుతూ ఉండేవి.

జాతీయ ఉద్యమంలో సంఘ సంస్కరణ ఓ భాగం. హరిజనోద్ధరణకీ కుల వ్యవస్థా నిర్మూలనకీ గాంధీ ఏర్పాటుచేసే కార్యక్రమాలు ఛాందసుల మూల సిద్ధాంతాన్ని ఓ ఊపు ఊపేవి భారతీయ నీతిసూత్రాలకి ప్రాణం పోసి ప్రాచుర్యం యిచ్చే గాంధీ బోధనలు వళ్లత్తోళ్‌లో గాఢంగా నాటుకొన్నాయి. హిందూ సమాజంలోని హెచ్చు తగ్గుల్ని ఎన్నో కవితల్లో ఖండించాడు. 'ఐక్యమే సేవయళ్ సేవ్యమ్' (అన్నిటికన్న ఐక్యత మిన్న) లో యిలా వక్కాణిస్తాడు :

'నన్ను ముట్టుకోకు నామాలకాకీ' అనుకుంటూ
మనలో మనల్నే మరొకరిగా చూసుకుంటూ
ఇలా అనుభవిస్తూంటే యీ స్వయంకృత బహిష్కృతి,
ఇంకేం అర్థమైనట్టు భారతీయ సంస్కృతి ?

'పరస్పరమ్ సహాయిప్పిన్' (ఒకడి కొకడు, కావాలి చేదోడు) లో 'చిన్న చిన్న ముక్కలుగా విడిపోయి అటూ ఇటూ లాక్కుంటూ ఉంటే దాస్యశృంఖలాలు మరింత బిగుస్తాయి సుమా!' అని హెచ్చరిస్తాడు సోదర కేరళీయులకి అతను గుర్తుచేస్తాడు సహృదయ అయిన తమ మాతృదేవత ఓ అట్టడుగు కులస్థుడి యింట్లో ఎలా వేదదీపం వెలిగించిందో. అతని కవితలో అలాంటి భావాలు కొల్లలు. 'పాపమోచనమ్' లో ఇతివృత్తం హరిజన దేవాలయ ప్రవేశం దానికోసం వైక్కోమ్‌లో జరిగింది సత్యాగ్రహం. అందులో కార్యకర్తలు అతని దృష్టికి ధర్మస్థాపకులు. వాళ్లని చూపిస్తూ అతనిలా అంటాడు .

మనిషిని మనిషే చులకన చేసే
మహాపరాధం ప్రక్షాళిస్తూ
ధర్మస్థాపకుల నుదుటను పట్టిన

ఘర్మ జలాలను పానం చేస్తూ
పుడమితల్లి యట పునీత అయ్యేను.

కులవ్యవస్థలోని అసందర్భాన్ని అపహసిస్తూ వళ్లత్తోళ్ చిన్న కథ కల్పన కూడా చేశాడు. అంతకుముందు రాసిన నీతిపద్యాలుకాక, 'ఉద్ధారిళ్ ఉద్దన్' (సత్తె కాలపు సత్తెయ్య) లో ఓ రాత్రివేళ ఓయిల్లు అంటుకుంటుంది. పెద్దకులానికి చెందిన ఓ నాయరు గారిది ఆయిల్లు. మంటలు మిన్నంటుకునే వేళకి అదృష్టవశాత్తూ ఇంట్లో వాళ్లు ప్రాణాలతో బయటపడతారు. కులబహిష్కృతులు కొందరటువస్తారు ఆ మంటలు చూసి. అందులో కొందరు ఆ నిప్పు ఆర్పడానికి నూతిదగ్గరికి పరుగెడతారు. ఇంటి యజమాని ఎంతో కోపంతో వాళ్లని అడ్డుకుంటాడు:

పోనీ, కాలిపోనీ, నాయిల్లు కూలిపోనీ
హద్దుమీరి అడుగుపెట్టి అపవిత్రం చెయ్యకండి
గంగిగోవు లాంటి నుయ్యి కాలుష్యం చెయ్యకండి

ఇల్లు తగలబడుతుంది. గోలపెడుతున్న ఆమాయకుణ్ణి చూసి కవి చమత్కరిస్తాడు

కొంప కాలిపోయిందని గోలెందుకు నాయరూ?
బంగారం లాంటి కులం నిలిచిందది చాలదూ!

వళ్లత్తోళ్ లాంటి సంప్రదాయవాది కులవ్యవస్థమీద కత్తిగట్టడం ఆశ్చర్యకరం. 'జాతిప్రభావమ్' అనే కవితలో గౌరి అనే అందకత్తె ఉంటుంది. ఆమె డబ్బున్నదీ చదువుకున్నదీ అన్నిటిని మించి పై కులానికి చెందినది. భైరవు డనే క్రింది కులం విరక్షరాస్యుణ్ణి ప్రేమించి పెళ్లిచేసుకుంటుంది. కథ అడ్డం తిరిగి వాళ్లిద్దరూ బొత్తిగా లేనివాళ్లై, జబ్బుచేసి అతను చనిపోతాడు. జీవితం లాగే సౌందర్యంకూడా ఛిన్నాభిన్నమై గౌరి బిచ్చగత్తెగా మారుతుంది. కన్నవారింటి కెళ్లి చెయ్యి జాచితే వాళ్లు ఈమెను చూసి విర్ఘాంతపోతారు. తర్వాత తన్ని తగిలేస్తారు. ఈ సన్నివేశంలో కవి నాటకీయత ఉపయోగిస్తాడు. గౌరి పుట్టింటివారి దురహంకారమూ, హృదయ కాఠిన్యమూ ఎంతో నేర్పుతో చిత్రిస్తాడు. అయితే తగినంతగా యిది విమర్శకుల దృష్టిని ఆకట్టుకోలేదు. మారుతున్న సమాజంలోని విజమైన సన్నివేశాలు సృష్టించే సమస్యలు తెలియబరచడమే దీనికి కారణమేమో. ఏమయితేనేం, వళ్లత్తోళ్ మానవతా దృక్పథానికి యిది గీటురాయి.

ఆ రోజుల్లోని మరో ముఖ్యవిషయమైన హిందూ ముస్లిమ్ సామరస్యం గురించి కూడా వళ్లత్తోళ్ రాశాడు. ఆ సమస్యని అతను ఎత్తుకొనేతీరు. ఆదర్శ ప్రాయమూ, భావప్రధానమూ. 'అన్నదమ్ముల మధ్య వైరం వైరంకాదు, ఓ కీచు లాట, ఓ అలక, అంతే' లాంటి విసుర్లు విషయాన్ని పక్కదారి పట్టించవచ్చు కాని యీ ఊహాగానం లోంచి కూడా కొన్ని ఆణిముత్యాలు ఊడి పడ్డాయి. గోహత్య నిషేధించడానికి సాటిమానవుడి హత్యకి కూడా వెనుదీయడు హిందువు! అతని అమానుషత్వం అజ్ఞానం ఎత్తిచూపుతాడు వళ్లత్తోళ్. మేళతాళాలను అడ్డుకునే ముస్లిమ్‌తో అతనంటాడు.

గాన కళామయ రసధుని అల్లా
గాన వాద్యములు వలదని అంటే
ఏదీ సుమధుర విహంగ గానం?
ఎక్కడ సాగర మృదంగ ధ్వానం?

వళ్లత్తోళ్ ప్రధాన ఆదర్శం రాజకీయ స్వాతంత్ర్యం. మతకలహాలుగాని కుల వ్యవస్థ వికృతరూపంగాని అతన్ని ప్రధాన ఆశయంనుంచి మళ్లించలేక పోయాయి. అంతఃకలహాలుగల జాతికి స్వేచ్ఛపొందే హక్కులేదనీ, అణగబడ్డ జాతికి స్వతంత్రం అనేది పగటికల అనీ యిలాంటి 'రొడ్డకొట్టు' ప్రవచనాలకి వళ్లత్తోళ్ కించిత్తు అయినా చలించినట్టులేదు. 'పరవశ్యమ్', 'మా జవాబు'ల్లో అలాంటి వితండవాదాలకి తగిన జవాబు చెప్పేడు. 'జడుసుకునేవాడికి తన నీడయినా హడలే' అని కవి ఉవాచ. ద్వేషానికి మూలమేమిటో సునిశిత దృష్టితో పరిశీలించాడతడు. అది భయం వల్ల కలిగినది, స్వేచ్ఛ లభిస్తేనే యీభయం తొలగేది. ఓ మహమ్మదీయ మతోన్మాది చేత స్వామీ శ్రద్ధానంద హత్యచేయబడినప్పుడు ఎంతో నిరాశా నిస్పృహలతో తక్షణం స్వేచ్ఛ ప్రసాదించమని ప్రార్థిస్తాడు 'ఈ దాస్యం ఇక భరించలేం. మమ్మల్ని రక్షించు' అనేది అతని అభ్యర్థన. కులవ్యవస్థ కాలిసంకెలలు అతన్ని భయపెట్టవు. గబగబా నాలుగు అడుగులు ముందుకి వేస్తే అవి ముక్కలయిపోతాయని అతని ధీమా.

'పరవశ్యమ్' (పరాధీనపు బతుకు) అనే అతని జాతీయ కవిత మనల్ని బాగా కదిలిస్తుంది. స్వామీ శ్రద్ధానంద హత్య జరిగినప్పుడు గాఢ దుఃఖానుభూతితో రాసింది అది. అతని దృష్టిలో అదొక జాతీయ విషాద గాథ, ఆత్మపరాజయం. దేశదాస్యం చూసి అతనెంతో కూలిపోతాడు.

కబళించిన గ్రహణానికి తరుణే లేదా?
వెన్నెలయ్య బతుకుకింక విడుపేరాదా?

మందు సూర్యుని ధాటి కెండిపోయెను ఏరు
పొంగి పోయేటట్లు కురవదావాన ?
వాసంత మిచ్చటికి వచ్చుట మరిచెనా ?
మా సీమ కెప్పుడూ హేమంత మేనా !

విష్ఫలమైన కృషిలోని ఆలసట యిలా వివరిస్తాడు

శరీరాలు రోగమయం యుగయుగాల పేదరికం
ఇవి చాలక బానిసత్వ భారము మా తరమా ?
ఒక అడుగే ముందుకి పది అడుగులు అవి వెనకకి
ఫలమెరుగని శ్రమజీవన మది వృథాప్రయాన
గానుగెద్దు జీవితాన కడకు మిగులు నిరాశ

ఈ భంగపాటుకి కారణమేమిటో యిలా ఎత్తి చూపుతాడు :

మానవతను మరచిపోయి
మనం మనం కలహిస్తే
మనకి మరేం మిగులునోయి ?
మత సందేశం సామరస్యమని
మనకి తెలిసినా ద్వేషిస్తున్నాం
బానిసబతుకుకు బలమిస్తున్నాం
చీకటి దిక్కున పయనిస్తున్నాం.

శ్రద్ధానంద మరణానికి ఎంతో చలించిపోయాడు పశ్చాత్తాప్. కాలాత్ముడూ కరుణాస్వభావుడూ అయిన దేవుణ్ణి యిలా ప్రార్థిస్తాడు :

నీడకే హడలా ! ఆ బెదురు పోవాలి
అభయప్రదానం మాకు కావాలి
స్వేచ్ఛమయజీవనం అందుకోవాలి
ఇంకానా ఈ దాస్యం ? ఎన్నాళ్లు ఆలస్యం !
తప్పులను మన్నించు తక్షణము రక్షించు

విషాద గంభీరాలు మేళవించేయి ఈ కవితలో. స్వతంత్రం పట్ల అతని గాఢానురక్తికి నివదింపలేని విధివిన్యాసం గుదిగుచ్చబడింది ఇందులో. దీర్ఘాను

భవంతో కలిగే పరిశీలనాశక్తీ, జీవితంపైన అచ్ఛమైన అంతర్దృష్టీ, సంశ్లిష్టమైన భావపరిపుష్టి - యివన్నీ కలిపి యీ కవితకి అనన్యమైన ఘనత తెచ్చిపెట్టేయి.

'ఎంతే ప్రయాగస్నానమ్' (ప్రయాగలోనా పవిత్రస్నానం) అనేది అతవి మరో చెప్పుకోదగిన కవిత. కేరళ తరపు కార్యకర్తగా 1928 లో కలకత్తా కాంగ్రెసులో పాల్గొన్నప్పుడు రాసిందిది సుమారు పదివేలమంది కార్మికులు అందులో పాల్గోడానికి బయదేరేరు. పైకులం కార్యకర్తలంతా కలవరపడ్డారు, కస్సు బుస్సు మన్నారు. నోట్లో అక్షరమ్ముక్క-లేని నల్లటి యీ మురికి ప్రజ యిలావచ్చి పడిపో తున్నారేమని. పెద్ద ఊరేగింపుగా తరలివచ్చి ఆ కూలీలంతా కాంగ్రెస్ 'పెండాల్'లో ఎవరిస్థానం వాళ్లు అలంకరించారు వాళ్లని చూడగానే ఆనందతరంగాలతో ఉప్పొంగి కవి అంటాడు.

వీరందరు గుమిగూడిన
వీరులతో చేయికలిపిన
సమ్మేళన మీనాటికి
సంపూర్ణత సాధించెను
కార్యకర్తలీ ఘనులకి
స్వాగతాలు పలకండి.

తర్వాత వచ్చిచేరిన వ్యవసాయదార్ల గురించి అతని అభిప్రాయం.

తమ ఆకలి అణచిపెట్టి ప్రజల కింత తిండిపెట్టు ధన్యజీవులు
తము చీకటిలోన క్రమ్గి పరుల బతుకు వెలుగుచేయు కర్మయోగులు
మునులగన్న పుణ్యభూమి కలలుగన్న మొదటిపంట. స్వార్థత్యాగులు
మట్టిలోని మణిపూసలు మన జాతికి వెనుపూసలు రైతువీరులు

కాంగ్రెసు కార్యకర్తల్లో తెల్లదుస్తుల్లో వచ్చిన స్ఫురద్రూపులు గంగమల్లే కొత్తగా వచ్చిచేరిన నల్లనివారు యమున మల్లేకవిపించారు వళ్ళత్తోళ్ కళ్ళకి. ప్రయాగలో ఆ సమ్మేళనం ఆ విధంగా పవిత్ర నదీ సంగమం అయింది. అందులో ఎన్ని మునకలువేస్తే కవి హృదయం ఆనందంతో అన్ని ఉరకలు వేస్తుంది. తనకి ప్రత్యక్ష పరిచయం ఉన్న కార్మిక కర్షకవర్గాలపట్ల తన కవితల్లో ఎంతో గౌరవం సానుభూతీ చూపిస్తాడతను. నిరంతరకృషిచేసే కష్టజీవులు వాళ్లు. వాళ్ళనేదో మనం పోషిస్తున్నట్లు చులకన భావం తోచనివ్వకుండా ఆసక్తీ గౌరవమూ ప్రకటిస్తాడు.

అతడి మొట్టమొదటి పద్యాల్లోకూడా యీభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అప్పటికి కేరళ రాజకీయ జీవనంలో సామ్యవాదభావం యింకా అడుగుపెట్టలేదు. అయినా వళ్లత్తోళ్‌లో స్వతహాగా ఉన్న మానవతావాదం గాంధీ ప్రభోదంతో మరింత బలపడి భారతీయ జీవనాన్ని సక్రమంగా అవగాహన చేసుకునేలా చేసింది. దీనితో అతను కులవ్యవస్థకి అతీతుడై నిలబడగలిగేడు, బలీయమైన జాతీయభావం నిలుపుకో గలిగేడు. 'ప్రయాగస్నానమ్' అతని మానవతావాదానికి ప్రతీక. రాజకీయ జీవనం లోని మానవతావాదం, వాస్తవిక వాదంలోని ముఖ్యాంగం. ఇది ఎంతో అంత ర్దృష్టితో గ్రహిస్తాడు వళ్లత్తోళ్ కష్టజీవులు కాంగ్రెసులో కార్యకర్తలుగా పాల్గోడం మితవాదుల మెతకతనాన్ని కుదురుస్తుందనీ దాంతో బేషరతుగా స్వరాజ్య ఆదర్శానికి కాంగ్రెసు కట్టుబడి తీరుతుందనీ చెబుతాడు యీ కవితలో. అతని తరువాతి పద్యా లలో గాంధీ ఆరాధనకీ, వామపక్ష వాదభావాలకీ పొత్తుకుదరక కొంత అసందర్భంగా కనిపించవచ్చు. ఇలా అతను వామపక్షం వైపు మొగ్గడం రాజకీయ మూలసిద్ధాం తాల్లో వచ్చిన మార్పేంకాదు. స్వతంత్ర భారత దారిద్ర్యం, అసమానతల సమస్యా పరిష్కారంలో ఏర్పడిన మందకొండితనం అతను సహించలేకపోయాడు. అహింస పట్లా, పురాతన భారతంలోని నీతి సూత్రాలపట్లా అతని విశ్వాసంమాత్రం ఎప్పుడూ చెక్కుచెదరలేదు.

స్వతంత్ర సమరంనాటి ప్రముఖదినాల్లో వెలువడిన వళ్లత్తోళ్ దేశభక్తి కవి తకి హృదయపూర్వకమైన ఆదరణ లభించింది. కేరళ ప్రజలకి అవి ఎంతో ఉత్సాహ కరంగా ఉండేవి 'మాతృవందనమ్', 'పోరాపోరా', 'ఎంతే గురునాథన్' నుంచి ఎన్నో పద్యాలు వేలకొద్ది కేరళీయులు అప్పటికప్పుడు అప్పజెప్పేవారు. అతని దేశ భక్తి గీతాల్లో కొన్ని యీనాటికికూడా వాటి ప్రాచుర్యం నిలబెట్టుకున్నాయి. ఈ ప్రాచుర్యానికి కొంతవరకూ ఆ పద్యాల్లోని కవితా నైపుణ్యం, కొంతవరకు ఆ విష యాలు భారతీయ దృక్పథానికి అతిసన్నిహితంగా ఉండడం, కారణాలు. సమకాలీన సమస్యలతో ముడిపెట్టుకున్నంత మాత్రాన ఏ కవీ గొప్పవాడు కాలేడు. వళ్ళత్తోళ్ చరిత్రసృష్టి జరుగుతున్నపుడు జీవించి ఉన్నాడు. మహాపురుషులకి సమకాలీనుడు, బలీయమైన సంఘటనలకి ప్రత్యక్షసాక్షి. ఇది కేవలం అదృష్టమేకాదు. పెద్ద బాధ్యత కూడాను. అతను ఆ మహద్భాగ్యమూ అందుకున్నాడు. ఆ భారమూ పైనవేసు కున్నాడు. ఒక కవిగా మానవుడిగా సహృదయుడనీ, ఉదారస్వభావుడనీ రుజువు చేశాడు. జాతి జాతినంతా ఓ ఊపు ఊపిన భావతీవ్రతకతను ప్రాతినిధ్యం వహిం చాడు. చరిత్రలోని నాటకీయతకు స్పందించగల నిజాయితీ, భావపటిమా అతని

ఉన్నాయి. జాతి అంతస్థుని పెంచేటట్లు నిర్భయంగా చెప్పగల గుండె దిటవు అతని సొమ్ము. అతను లేందే కేరళలోని జాతీయత అంత బాగా వ్యక్తమయేది కాదు. నీతిపథంలో అయినా భావపరిధిలో అయినా అవగాహన అనేది అంతంతమాత్రం గానే ఉండిపోయేది. ఆలోచనలూ అంతఃకరణలూ పైకి చెబితేనే నలుగురికీ తెలుస్తాయి. అదిగో అలాంటి స్పష్టీకరణవల్లనే ఏజాతిఅయినా రూపురేఖలు దిద్దుకొనేది.

# నాలుగో ప్రకరణం

## వళ్లత్తోళ్ లఘుకృతులు - ఒక పరిశీలన

వళ్లత్తోళ్ లఘుకృతులు సాహిత్యమంజరి అనేపేరున పదకొండు సంపుటాలుగా వెలువడ్డాయి. ఇవికాక వీరశృంఖల (వీరుడికి గాజులు), దివాస్వప్నం (పగటి కల), విషుక్కణి (విషూదయంలో నైవేద్యం) ఇండియాయుతే కరాచిల్ (ఇండియా కన్నీళ్లు), వళ్ళత్తోళ్ రష్యాయిల్ (రష్యాలో వళ్ళత్తోళ్) అనేవికూడా లఘుకావ్యాలకిందే వస్తాయి. సంపుటాలలో మొత్తం 214 పద్యాలున్నాయి. సాహిత్య మంజరి మొదటి ఏడు సంపుటాల పద్యాలూ అతి ఆహ్లాదకరమైనవి.

వళ్ళత్తోళ్ పద్యాల్లో వైవిధ్యం బాగా ఎక్కువ. విషయంలో విధానంలో; రీతిలో మనస్థితిలో; ఛందస్సులో పదాల ఎంపికలో ఉన్న తేడాలవల్ల వర్గీకరణ చాలా కష్టం. అయితే అతని కవిత మూలతత్వాన్ని పరిశీలించడానికి కొన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు.

### క వి త

ఇది పదిపద్యాల లఘుకృతి. సంస్కృత ఛందస్సు శార్దూల విక్రీడితంలో రాసిందిది. 1927 లో ప్రచురితమైన సాహిత్యమంజరి ఆరోసంపుటిలో చేర్చబడింది. కవితగూర్చి ఏ కవి రాసినా అతని విశ్వాసాలూ ఆదర్శాలూ వెల్లడికాక మానవు. కవిత అంటే అతని ఉద్దేశం ఏమిటో వళ్లత్తోళ్ యీ రచనలో తెలుస్తుంది. అతని పద్యాల అనేకానేక లక్షణాల పరోక్షవ్యక్తీకరణ కనిపిస్తుందిక్కడ. అతని దృష్టిలో కవిత అనేది ఓ దేవత. ఓ అందాల సుందరి. ఓ అజేయ తేజో

రాశి. ఆమె మనకి గోచరించదు చూపినా విన్నా అనుభవించినా దాన్ని పరోక్షంగా పొందవలసిందే.

కవితా స్వరూపిణి సరస్వతి కరుణారసదృష్టి వర్ణనతో ఈ రచన ఆరంభ మౌతుంది. 'చుక్కలకు పేరుతెచ్చే రాత్రి అది. చాతకమనే మనో విహంగానికి నీలి మేఘం రాక అది సారస్వత హృదయంమీద ఇంద్రనీలం అది' . ఇలా సాగు తుంది. అందాల సుందరి చూపులు కవి భావనలో నల్లనివి కాబట్టి కవిత దృష్టిని వరసగా నలనల్లని వస్తువులతో పోల్చడం ఓ మనోహర రూపకల్పన. మొట్టమొదట్లో అఖండకీర్తిని ఉదహరించడం గమనార్హం. మిల్టన్ లాగే వర్డ్స్‌వర్త్‌కి కూడా కీర్తి అనేది ఉబ్బితబ్బిబ్బాగించగలదు. తొలిపద్యం అతి సామాన్యమైన భావనాబలం కలది. అయితేనేం గురుతర సంస్కృత పద సమన్వితం అది. నీలిదృక్కుల మనోజ్ఞ భావనా సురుచిరం అది. రెండో ప్రకరణంలో ఉదహరించబడిన వర్డ్స్‌వర్త్ ప్రసిద్ధ కవిత తర్వాత వస్తుంది. ఝళిపించిన వీరుడి కత్తిలో కనిపించిన ధగధగలోనూ, ఆడి అలసి స్వేదబిందువుల్తో మెరుస్తున్న పసిపాప గులాబీ బుగ్గల్లోనూ, తన ప్రియుడివైపు బరపే ఓ సుందరి ప్రేమ దృక్కుల్లోనూ కవికి సుందరకవితారూపం గోచరిస్తుంది. రెండో పద్యంలో వాణీవిన్యాస రూపాన మా వసంతరుతు వైభవం వర్ణితం. కోయిల గానం ఆమె గానం. లతల నాట్యం ఆమె నాట్యం. మకరందం ఆమె మధుర సల్లాప మరందం. ఈ రెండుపద్యాలూ వర్డ్స్‌వర్త్ కవితలోని విషయానుభూతికి ఖచ్చితమైన ప్రకటనలు. సౌందర్యమంటే అతని దృష్టిలో విషయసౌందర్యమే. అది స్పర్శాగోచరం, స్పష్టం, నిత్యనూతనం. ఇక్కడ ఓ విషయం ఆసక్తి కలిగిస్తుంది. అతని కవిత లోని మూడు ముఖ్య భావావేశ లక్షణాలూ కనిపిస్తాయి. అవి వీర శృంగార వాత్స ల్యాలు. ఎంత గొప్ప విషయాన్ని కుదించి చెప్పినా కుంటుపడదు అతని గ్రహణ శక్తి. తొట్రుపడదు అతని వచనయుక్తి సరస్వతి మందహాసంవల్ల వెన్నెలమరింత వెలిగిపోతోందిట. అందులో వింత ఏమీ లేదట. ఎందుకంటే పోల్చుకునేశక్తి ఉన్న ఎవరికైనా ఆఖరికామె కన్నీళ్లయినా గులాబీ అత్తరులా ఆహ్లాదకరంగా ఉంటా యట. . ఇలా నడుస్తుంది. వేదన అయినా ప్రసన్నభావంగా మార్చగల కవిత అద్భుతశక్తి యిక్కడ గమనార్హం. కవిత కరుణాకటాక్షం భోగభాగ్యాలకి బంగారు బాట. అది దొరక్కపోతే ఆ మనిషికి పాతాళమే పరమావధి. అప్పుడు ధీరుడైనా భీరువే, పండితుడైనా పామరుడే, కొండయినా గడ్డి కుప్ప, రాజయినా బిచ్చగాడు. కవిత వివిధ ఘనతలు పేర్కొనబడ్డాయి తర్వాత. ఆగమాలు ఆమె శాసనాలు

పురాణాలు ఆమె ఉపదేశాలు. ఆతల్లి కావ్యాలు రసమయకావ్యాలు. ఆమె హృదయంలో జ్ఞానబీజాలు నాటుతుంది, అల్లాడిపోయే మనిషికి అమృతంలాంటి ఔషధం ఇస్తుంది. స్వేచ్ఛకి భంగం కలిగించని సద్వర్తన బోధిస్తుంది. ఆ తర్వాత కవితోదయం వర్ణిస్తాడు కవి. చీకటిని చీల్చి వెలుగు విజేతగా విల్రాక్కుకొనే ప్రభాత సమయాన సమస్త జగతీ కవితా గానం చేస్తుంది:

తరగ తరగను కదలి సరిగ సరిగమ పలికె
దినకరుడు వీణపై ఉదయరాగము మీటె
కోయిలగొంతులో కొత్త సంగతులూరె
భృంగాలు విరులలో శృంగార శృతివేసె
స్వర సర్వస్వమా! సాహిత్యరూపమా!
జగమంత వినుమెచ్చి సంగీతసభ చేసె.

రాతిరి గతించడం పవలు ఉదయించడం అనేవి తామసగుణం నశించడానికీ సత్త్వగుణం ప్రభవించడానికీ సంకేతాలు. మనసు నిర్మలమైన సాత్త్వికస్థాయిని చేరుకుంటేనే ప్రేరణకలిగి నాదబ్రహ్మని ఉపాసించగలం ఈ ప్రేరణ అనేది కవు లందరిలో అస్థిరమైపోతోందనీ చంచలమై పోతోందనీ ఆఖరి రెండు పద్యాలలో కవి ఆరోపిస్తాడు. సరస్వతి చంచల హృదయ. ఏమంత ఆధారపడతగింది కాదు. మాయచేస్తుంది. మనసుని ఆక్రమిస్తుంది. కోరికలు మాత్రం కొనరి కొనరి తీరుస్తుంది. ఆమె కంకణ నిక్వణం వినగానే ఆమె ఉజ్జ్వలరూపం కనగానే ఆనందంతో మైమరచిపోతాడు. కనుతెరచి చూస్తే ఏముంది? ఆమె లేదు మిగిలింది చీకటి! 'నా హృదయరాజ్ఞీ నన్ను విడనాడకే!' అని ప్రార్థిస్తాడు. విశ్వప్రకృతి అవస్థకూడా అంతేనని గమనిస్తాడు. ప్రకృతి చెయ్యగలిగింది ఏముంది. ఆకాశం నీలంపుటలో తెల్లని అక్షరాలు రాయడం, చెరిపెయ్యడం, అంతే! దివ్యశక్తి ఆ సరస్వతి ఒకరికి లొంగే ఘటం కాదాయె.

ఈ కవితలో వళ్లత్తోళ్ మూడు కావ్యలక్షణాల్ని ఎత్తి చూపుతాడు. అవి విషయాసక్తమూ, నైతికమూ, దైవసంబంధమూ. విషయాసక్తత ఆకర్షించేది, నీతి అనేది విశరానిది, దైవీభావం అందీ అందనిది. కవిత మూలాధార సూత్రాలు యిక్కడ కనిపిస్తాయి. దివ్యప్రేరణ ఫలితమే కవిత్వం. ఆహ్లాదం కలిగిస్తూ బోధించడం దాని పరమావధి. ఏ భావాన్నయినా రసాత్మకంగా మార్చడంలోనే ఉంది కిటుకు, ఆదర్శ జగతిని సృష్టించడంలోనే ఉంది దాని సొగసు. వళ్ళత్తోళ్ దృష్టిలో

యీ ఆదర్శజగతి అంతా విషయానుభూతితో నిండిఉంది. అందుకనే శక్తి వదుమ ధగధగలో, హరిణాక్షి చూపుల మిలమిలలో అంతవి కంత మక్కువ. ఈ కవిత సుందరకావ్యప్రకృతి కాక సూక్ష్మకృతి. ఇందులో వాక్సరణి బహుసంస్కృత పద సమన్వితం. ఛందస్సేమో సంస్కృతానిది. పదాలు ఎక్కువగా సంస్కృతానివి. కవితపట్ల ధోరణి సంప్రదాయబద్ధమైనది. ఇవన్నీ కలపిన యీ కవిత ఓ సంపూర్ణా కృతిగా గోచరిస్తుంది. వళ్ళత్తోళ్ కవితాశిల్పాని కిదొక గీటురాయిగా నిలుస్తుంది. కవిత గొప్పదనానికి సామాన్యమైన అంచనా వేసిచూస్తే రాజసం ఉట్టిపడే సంస్కృత శక్తినిబట్టిగాక మాధుర్యం, మానసోల్లాసం కలిగించే మలయాళ పదాల జిగిబిగి వల్లనే యీ కవిత పదికాలాలపాటు నిలుస్తుందని తెలుస్తుంది.

## కి లి క్కొం చ ల్

వళ్ళత్తోళ్ కమనీయ కవితల్లో ఇదొకటి. ద్రవిడ ఛందస్సు మంజరిలో రాయబడిందిది. అతని కళాభిజ్ఞత అంతా కళ్ళకు కట్టిస్తుంది. 1924 లో ప్రచురిత మైన సాహిత్యమంజరి నాలుగో సంపుటంలో చేర్చబడింది.

ఇందులో కవి తన పరితల్ని ఊహా గగనపథాన గతంలోకి విహారయాత్ర చేయిస్తాడు. కళ్లు తెరిచేసరికి పరితలు మిధిలానగరంలో ఉంటారు. ధర్మదండం అనే చుక్కాని చేతబట్టి సంసారసాగరం ఈదిన జనకరాజు రాజధాని అది అక్కడి భవనాలమీద ఎగిరే పతాకాలమీది గుర్తు నాగలి. అక్కడి మందిరాలలో విద్వాం సుడూ విరాగీ అయిన యాజ్ఞవల్క్యుడూ, గ్రంధాలు లిఖిస్తూ అతని శిష్యులూ కని పిస్తారు. త్రయంబకం అని పిలవబడే శివధనుస్సు ఉన్నతవేదికమీద గోచరిస్తుంది. పతితల్ని అక్కడైనా ఉండనిస్తాడా, కవి? ఊహూఁ. రాజోద్యానంలోకి లాక్కు పోతాడు హడావిడిగా. అతను అంటాడు :

ప్రసూనాలు తిలకిస్తూ
పల్లవాలు పరికిస్తూ
కన్ను తిప్పుకోనేరక
కలవరపడ నేలనోయి ?
అసలుతోట అటుకాదట
ఈ సీమను వెలపిందట
అయిదేడుల బాలిక అయి

ఆరామం మురిపించిందట
చంపకవిరి ఆ దేహము
గులాబిసరి ఆ వదనము
పోలికనుల ఆ సోకులు
నీలికలువ పూరేకులు
విరితీవెలు ఆ చేతులు
లేచివురులు అరిచేతులు
ముడుకుదాటు ముంగురులు
ముసిరే తుమ్మెదతతులు

ఆటలో లీనమైపోయింది ఆ అమ్మాయి. జంతువుల బొమ్మలు వరసగా పేరుస్తుంది. తానే ఇల్లాలు అయినట్టు వాటికి పాలతో ఫలాలతో పంచదారతో చేసిన రకరకాల రుచికరాలు వడ్డిస్తుంది. బంగారు కూజాలో నీళ్ల నింపి మొక్కలకి పోస్తే అవి సరదాగా తలలాడిస్తాయి. పెద్ద ఆరిందాలా చీరలా చుట్టబెట్టుకున్న పట్టుగుడ్డ రంగును పరచి బొమ్మని ఉంచి బొమ్మతొడమీద నెమ్మదిగా జోకొడుతూ జోలపాట పాడుతుంది. ఆ తర్వాత విష్ణువు విగ్రహం ముందు ధ్యానిస్తున్నట్టు కళ్లుమూసుకు కూచుంటుంది. అలాగర్గి చెయ్యడం చూపిందిగా. అలా ఎన్నో జీవన దృశ్యాలు అభినయిస్తూ ఉండగా గగన ప్రశంసాగానం చేస్తున్న రామచిలకల జత ఒకటి ఆ అమ్మాయి కంటపడుతుంది :

పలుకుచూడు, మనుషులలాగే!
చిలక జోడు ఇటు తెమ్మనవే!

అవి పురమాయిస్తే భటులు తేకేం చేస్తారు! అప్పుడు చిన్నారి సీత ఏం చేసినట్టు?

మణులతో పసిడితో
మెరసేటి మెడపైని
పక్షికూనల నడిమి పరవశించె
చిన్ని ఎఱ్ఱని నోరు
చెవి ప్రక్క తాకించ
కెంపు అతికినయట్లు కానుపించె
పక్షిదేహము సొగను

పట్టుకంచెను నునుపు
అంతకంటెను మృదువు అమ్మాయి తనువు
పాలూ తేనె యిచ్చినా బెదిరిపోయిన ఆ పిట్టలు ముట్టుకుంటేఒట్టు!
బంగారపు పంజరమైనా
బందీ ఒక బానిసయేగా!

ఈసారి దృశ్యం సీతా వాళ్ళమ్మని చూపిస్తుంది. జనకుని భార్య విశ్రాంతివేళ అది, ఎక్కడ చూసినా ప్రశాంతత, మైత్రేయి బోధించిన ఓ వేదాంత ధర్మసూత్రం ధ్యానించుకుని తన్మయత్వం చెందుతోంది ఆమె. వేదాలు ప్రశంసానాదాలు చేసే బ్రహ్మానందం స్వరూపం కూతురిరూపంలో గాలిలో తేలిపోయే బంతిపువ్వులా వస్తోంది ఆమె దగ్గరికి. సీత స్నేహితురాళ్లు లక్ష్మితో వచ్చే సంపదల సంహితలా కనిపించారు. కూతుర్ని చూడగానే రాణికి కలిగిన ఆనందాన్ని కవి యిలా వర్ణిస్తాడు:

తనవైపు వస్తున్న తనయను చూడగా
ఎడబాటు తరవాత కలసిన రీతిగా
ఆ తల్లి ముఖసీమ ఆనందమున వెలిగె.

చిలకలు చెప్పిన చిత్రమైన వార్త అమ్మ చెవిన వేసిందాకా అమ్మాయికి ఉండబట్టలేదు·

రాముడితో పరిణయమను
రాచిలకల పలుకులు విను

నే నొప్పుకోనుసుమా! అని గునుస్తుంటే ఈ గొడవంతా ఏమిటో పరిచారికని అడుగుతుంది తల్లి. పరిచారిక చెబుతుంది ఆ చిలకలు వాల్మీకి ఆశ్రమం నుంచి వచ్చాయని. వాల్మీకి పేరు వినగానే రాణి హస్తాలు తామర మొగ్గలా భక్తితో ముడుచుకుంటాయి. భవిష్యత్ బ్రహ్మ వాల్మీకి రాసిన రామాయణంలో పాటలు అవి గానం చేశాయి.

అనాడె అన్నాడు వాల్మీకి సుజ్ఞాని
ఆ రాజచంద్రుని అందాల రాముని
అమ్మాయి సీతాయి పెళ్లాడుతుందని
ఇంతకన్నా భాగ్య మింకేమి ఉందని!

అమ్మాయి అప్పు డడుగుతుంది, 'ఎందుకమ్మా రాముడు నన్ను పెళ్లాడుతాడని వాల్మీకి రాశాడు?' 'అదేంమాట తల్లీ. ఆడపిల్ల అన్నాక పెళ్ళి పేరంటం

జరగొద్దుటే?' అంటుంది తల్లి. 'నన్నెవరూ పెళ్ళాడక్కర్లా!' అని మూతి ముడుస్తుంది సీత. అందరూ గొల్లున నవ్వితే అమ్మ కంఠానికి అతుక్కుపోతుంది సీత.

కమ్మగా చెప్పడం ఒకటే కాదు, యీ కవిత లక్షణం. విషయమంతా ముందే స్పష్టంగా తెలిపి ఉండడం. అంతటా సజీవనాటకీయత నిండి ఉండడం. ఇంతేనా? మనోహరమైన వర్ణనా, మంజరీ ఛందస్సు మనోజ్ఞమైన నడకా, శైలిలోని మృదుత్వమూ స్పష్టతా ఇవన్నీ కలసి దీన్ని వళ్ళత్తోళ్ తీర్చిదిద్దిన ఉత్తమ కవితగా చాటుతున్నాయి. శైలి తియ్యనిదే కాని మొహం మొత్తేదికాదు. లయ సరళమైందే కాని సొగసులకేం లోపంలేదు. మధురమైన బాల్యదశని వళ్ళత్తోళ్ స్మృతికి తీసుకువచ్చాడు. సరళత్వం, అమాయకత్వం, ఆటవిడుపులోని మైమరపూ ఇవన్నీ కలసిన చిన్నతనంలోని అనిర్వచనీయమైన మాధుర్యం ఇక్కడ కనిపిస్తుంది. వళ్లత్తోళ్ చిన్నారి సీత మలయాళ కవితలోని అతిమనోహర రూపకల్పనల్లో ఒకటి.

## నరేంద్రుడి ప్రార్థన

పాణ అనే ద్రవిడఛందస్సులో ఇదో లఘుకృతి. ఇది సాహిత్యమంజరి అయిదో సంపుటిలో చేర్చబడింది. స్వామి వివేకానంద జీవితంలో ఓ సంఘటన దీనికి ఆధారం. సన్యాసం స్వీకరించకపూర్వం స్వామిపేరు నరేంద్రుడు. రామకృష్ణుడితో పరిచయం అయి ఆయన్ని గురువుగా భావించాడతను. ఒనాడు రామకృష్ణుడికి తన శిష్యుడి కంట్లో కన్నీళ్లు కనిపించాయి. తన శిష్యుడు అందగాడు, దయార్ద్రహృదయుడు. అతని గానవాహిని తన చెవికి అమృతలహరి. అతని దుఃఖానికి కారణం తెలియక చలించిపోయాడు రామకృష్ణుడు. శిష్యుణ్ణి అడిగాడు :

లోకంశోకం తుడిచేస్తానని
శపథం చేసిన నరేంద్రబాబూ
నీ కంట్లోనా కడివెడు దుఃఖం!

తడబడే గొంతుకతో నరేంద్రుడు చెబుతాడు వాళ్ళమ్మ పస్తులుంటోందని, తండ్రి బతికున్నప్పుడు ఆయిల్లు మానవసేవకు మారుపేరు. ఇప్పుడు గర్భదరిద్రానికి ఆటపట్టు !

ఏ జనని చనుగుడిచి ఇంతవాణ్ణయితినో
ఆమె పట్టెడు కూడు ఎరుగదు ఈనాడు

శిక్షించె మా అమ్మ, చూసి బతికున్నాను!
కృతఘ్నుడను కాను, కుమిలిపోతున్నాను!

తరుణోపాయం సూచించే రామకృష్ణుడు ఇప్పుడు శిష్యుడికి ధనసంపాదన ఎలాగో చెబుతాడు :

కరిగి దొరలేవెండి ఏ గంగ చలువ?
విరిపి మురిసేపైడి ఇనుడు ఎవ్వరివాడు?
ఇరులు చీల్చే మణులు తారల తావేది?
కాళికా జననికి
కేళికావని యిది
ఆమాతనే అడుగు
నీ లేమి పైదొలగు.

నరేంద్రుడు గాఢంగా నిట్టూర్చాడు. శాలువా చెంగు ముందుకి లాక్కుని పైబట్టతో కళ్ళద్దుకున్నాడు. తలవంచుకుని కాళికాలయానికి నడచివెళ్ళేడు. కొంత సేపు అయాక తిరిగివచ్చేడు. ఎప్పట్లా అశ్రువులు నిండిన కళ్ళతో. రామకృష్ణుడు అడిగేడు :

కల్పవల్లీతల్లి కాదు పొమ్మందా!
లేక నీ వినతిలో లోపమే ఉందా?

కాబోయే మహాయోగి అసలు సంగతి చెబుతాడు :

సంపదకాదు నే నడిగింది గురువరా!
సంపద అనే సంకెలనుండి విడుదల!

రామకృష్ణుడు తన ఆమోదం చిరునవ్వుతో సూచిస్తూ యిలా అంటాడు :

ఏబాధ కలిగిన సత్పథము విడువవు
చిరిగిన జోలెతో సిరిముందు నిలువవు
పాడు పైకముగోరు ప్రాపక మెరుగవు
నీవె ఈ 'మాయ'ను విడదీయ తగుదువు

క్లుప్తతలోనూ స్పష్టతలోనూ ఇదొక రస్యకవిత. ఉదాత్త విషయాన్ని చిన్న పరిధిలో మంచి నాటకీయతతో మలచడం మాటలుకాదు. గురుశిష్యుల ఔన్నత్యం విదితం చేయబడింది ఇందులో. యువకుడైన నరేంద్రుడ్ని ఉద్రేక

స్వభావమూ, గురువుపై అతని పరిపూర్ణవిశ్వాసమూ. గురువుకి శిష్యుడిపై గల అపారవాత్సల్యమూ, సర్వాంతర్యామీ సత్యస్వరూపిణీ అయిన కాళి మీద ఆయన అకుంఠిత విశ్వాసమూ ఎంతో బాగా పోషింప బడ్డాయి. దేవి మహత్తర సన్నిధిలో నరేంద్రుడి సహజప్రకృతి ఎలా బయటపడిందీ వీ రిద్దరి సంభాషణలద్వారా వ్యక్త మౌతాయి. సునిశితమూ పరిపూర్ణమూ అనే వళ్ళత్తోళ్ జంటకవితా లక్షణాల కలయికకి యీ కవిత మంచి ఉదాహరణ. విషయానికి తగిన ఉదాత్తతతో నడిచింది సహజమై సరళమైన అతని శైలి. సంస్కృత మలయాళ పదాల జిగిబిగి అల్లిక కనపడుతుంది. మణిప్రవాళంలోని ఒడుదుడుకుల్లేని పదాల అమరికా నడకా ముచ్చట కలిగిస్తుంది.

## రైతు గీతం

'కేక'లో రాయబడ్డ యీ కవిత సాహిత్యమంజరి ఏడో సంపుటిలోది. ఈ కవిత ఎత్తుగడే ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తుంది :

చివరికా లోహాని కీమాట తెలిసెనా
కరిగి నీరై పోక క్షణమైన నిలచునా !

ఇనుముని దుర్వినియోగంచేసే స్వార్థపరుల్ని ఉద్దేశించి అన్నమాట లివి. జీవితాన్ని నిలబెట్టే వ్యవసాయపు పనిముట్లుగా తయారుకావలసిన ఇనుము, జీవితాన్ని మట్టుబెట్టే ఆయుధాలుగా మార్చబడుతోంది. ఇది కూడదని ఎక్కడైనా ఓ తల పైకి లేస్తే అపహాస్యం చేస్తూ కత్తి దానిమీదకి దూకుతోంది, బల్లెం అటు వైపు ఎగురుతోంది. తుపాకి ప్రాణాలు తీస్తోంది. నియంత చేతి యీ హత్యలకి సాయం చేసేది ఇనుము. ఇనుము. బతుకులో యీ 'త్రుప్పుమరక' తొలగేది ఎలా?

లోహం అనుభవించే యీ కల్లోలం అర్థంచేసుకొనేది నిరక్షరాస్యులైన రైతులు తప్ప మరెవడు! యుద్ధ జ్వాలలతో గగనసీమని కలుషితంచేసే యోధులు తమ పేరుకు మాత్రం మెరుగులు దిద్దుకుంటారు. రైతువీరులు మాత్రం అలాంటి వారు కాదు. ఇంకొకర్ని అణగద్రొక్కి కుహనాగౌరవంమీద వాళ్ళకేం మోజులేదు. 'మిగిలిన కొండల్ని పిండికొట్టి మరీ హిమాలయాలు ఆ ఎత్తుకి చేరుకోలేదు గదా!' సాటి మానవులమీద ప్రేమవర్షంతో తడపకపోతే అవి మరుభూముల కిందే లెక్క. రైతులంటారు :

గోమయము అయినను ఒళ్లొంచి తీస్తాము
దురిత చరితముందు శిరసొంచలేము
నాగలి భారమ్ము నవ్వుతూ మోస్తాము
స్వార్థ శాసనాలు తలదాల్చలేము

స్వతంత్ర భారతంలోని కృషి ఒకరి మంచికోసం అనీ కీడెంచికాదనీ నొక్కి చెబుతారువాళ్లు. ఈ భారతం, సంకెళ్లు తెంచుకోడానికి ప్రయత్నించే ఓ ఐరావతం. అది స్వేచ్ఛకోరేది దేనికి? గంగవెఱ్ఱులెత్తి నలుగుర్నీ కలియ కుమ్మడానికి కాదు. దాస్యదుఃఖంలోంచి పదిమందినీ పైకెత్తడానికి. 'సర్వేజనా సుఖినో భవంతు' అనే వ్యవసాయదారుల ప్రార్థనతో కవిత పూర్తవుతుంది.

ఉన్నతభావనలో నిండిన యీ కల్పనలో అక్కడక్కడ అహ్లాదకరమైన మెరుపులు కనిపిస్తాయి. భావనపై ఆలోచన పైచెయ్యి అయిన కొన్నిచోట్ల నడక కొంత మందకొడిగా కనిపించవచ్చు. వళ్ళత్తోళ్ రాజకీయ స్పృహ వెల్లడించే కవితకి ఇది ఉదాహరణ. ఒక్కొకచోట ఆవేశం కుంటువడినా విషాదవాతావరణం ఆద్యంతమూ చక్కగా పోషించబడింది.

## చిరిగిన తలగడా

1916 లో రాయబడిన యీ కవిత సాహిత్యమంజరి తలి సంపుటిలో చేర్చబడింది. బహుళప్రాచుర్యం పొందిన వళ్ళత్తోళ్ కవితల్లో ఇదొకటి. అతని శైలిలోని స్పష్టతకీ సరళతకీ ఆ నడకలోని మృదుత్వానికీ ఇదో మంచి ఉదాహరణ. కవి ఇందులో మాట్లాడేది ఓ తలగడతో. అది నలిగిపోయినది, మాసిపోయినది. దూది పైకి వస్తున్నది. దాని గతవైభవాన్ని కవి యిలా గుర్తుచేస్తాడు :

అనాడు నీ తెలుపు ధగధగా మెరిసేను
మాసిపోతావని తాక మాచేయి జంకేను
ఈనాడు నీ సొగసు తలక్రిందు లయ్యేను
నిన్ను తాకినచేయి కడగాల్సి వచ్చేను !
ఆ తలగడాది ఓనాడు ఓ చక్కని యువతి పూలశయ్యపై

మురిపాల బతుకు :

నిండు పున్నమరేయి
ఇసుక తిన్నెలప్లాయి.

పట్టు పానుపు హాయి
పవ్వళించితి వోయి!
ఆ బాల ఆ జోల
ఆ లాలనల మ్రోల
తంగుపోగుల పూల
పింగారములవేల?
ఎన్నెన్నో పడకటింటి ముచ్చట్లకి ఆ తలగడా మూగసాక్షి.
అందగోర పతిదేవులు
సుందరాంగి తన పెదవులు
సిగ్గున పతి దొలగద్రోసి
అదుము విన్న అధరసీమ
సౌభాగ్యము కానాదుడు
ఎంత ఈసు చెందెనో!

వాళ్ళిద్దరూ తలగడామీద తలలు ఆన్చి గుసగుసలు పోతున్నప్పుడు వారి హృదయంలో వెల్లివిరిసే ప్రేమపూగుత్తుల తీయతేనియల కమకమ్మవి కబుర్లు యింకా గాలిదాకా అయినా రాకుండా ప్రప్రథంగా అందుకునే అనన్యభాగ్యం నీదికాక మరెవరిది!

హరిణనయన ఆ వయారి
సాయంతన జలకమాడి
శారదనిశి గగనసీమ
జలధరాలు ముసిరినటుల
తెల్లని నీ మృదుతలాన
నల్లని తన కురులు పరచి
కురులలోని విరజాజులు
తారలనే పరిహసింప
ఇంచుకంత విశ్రమించు
నీ బతుకే గుబాళించు
వినుతాకిన శిరితావులు
మరుపురాని మధురోహలు

ఇప్పు డా రోజులు గతించాయి. ఇప్పుడు నీది తడారిపోయిన ఎడారి బతుకు. గతం స్మృతిపథంలోకివస్తే అంతరించిన ఆనందం వెయ్యింతలుగా కవిపిస్తుంది. అంతలో తేరుకుని కవి అంటాడు. అంత దౌర్భాగ్యమేమీ కలగలేదే పర్యంకానికి! ఇంకొకరి సుఖానికి అంకితమైపోయిన పవిత్రజీవనం తలగడాది.

పరులకెపుడు సుఖము ఒసగు
కర్మయోగి పథమునీది
స్వార్థత్యాగి విధము నీది
నలిగితివని రేయిపవలు
వగవనేల తలగడా!
ధన్యమువీ మనుగడ!

బయటపడిపోయే దూదికి మరోమంచి తలగడా గలీబు దొరకుతుందనే దీవెనతో కవి కవిత ముగిస్తాడు. ఈ దూది అనేది సుస్థిరాత్మకు సంకేతం. భగవద్గీత లోని ప్రసిద్ధ శ్లోకం 'వాసాంసి జీర్ణాని' అనే శ్లోకం ఈ కవితాకల్పనకి ఆయువుపట్టు.

మొదట్నుంచి చివరివరకు ఊహాపథంలో ఉయ్యాలలూపి ఉల్లాసం కలిగించే వళ్ళత్తోళ్ యీ రచన అతని శిల్పచాతురికి మరో కలికితురాయి. అత్యుత్తమం అవి ఎంచక పోవచ్చు. సాహిత్యమంజరి సగటు స్థాయికిమాత్రం తీసిపోదు.

## ఎంతే భాష (నాభాష)

1927 లో వెలువడిన యీ సుప్రసిద్ధకైత కవికి తన భాషపై గల అభిమానాన్ని చాటుతుంది. సాహిత్యమంజరి ఏడో సంపుటిలో వచ్చిన యీ కవితలో వాడబడింది. మకందమంజరి అనే ద్రవిడ ఛందస్సు. మలయాళభాషకి గల సహజలక్షణాల వర్ణనతో మొదలౌతుంది:

తలచిన మది గర్వించును
తన్మయాన నృత్యించును
దరిసాగరి పలుకుబడులు
సహ్యగిరుల పట్టుదలలు
గోకర్ణుని ఆశీస్సులు
కన్యామణి చిరునవ్వులు

పెరియార్ మధుప్రవాహాలు
చందనవన పరిమళాలు
సంస్కృతమగు సహజ రుచులు
మధురతమిళ నుడిసొగసులు
కలుపుకున్న కలభాషిణి
మలయాళం మందాకిని!

శిశువు ఆరోగ్యమైన పెరుగుదలకి మాతృభాష అత్యవసరమని కవిచెబుతాడు :

అమ్మపాలను కుడిచి అతిపికలగలిపి
పసిపెదవి తొలుదొలుత పలుకు 'అమ్మా' అని
పైభాష లేపైన పైపుడు తల్లులు
కన్నతల్లీనుడులు గంపెడు మల్లెలు
తల్లిపాలను తాగి పెరిగిన పల్లలే
ఆరోగ్మ భాగ్యాన అలరారు ధన్యులు
సురలోకమును చేరి సుధతెచ్చి యిచ్చినా
అమ్మ వడ్డిస్తేనె అమృతము మాకు.

ఆది వేదం అవనీ. కావ్యంకానీ శాస్త్రంకానీ. ఎవరేం చదువుకోనీ ఏదైనా మనసుకి హత్తుకోవాలంటే అది మాతృభాషలోంచే రావాలి అప్పుడే మనసు మాధుర్యంతో నిండేది, ఆలా కాకపోతే హృదయపద్మం రేకుల్ని పైపైన ఆలంకరించే మంచుబిందువులు మాత్రమే మిగుల్తాయి. మాతృభాషకి శక్తి చాలదనే ఆరోపణని కవి యిలా ఖండిస్తాడు :

ప్రదమకావ్యమూ పంచమవేదం
నీతిశాస్త్రమూ ఉపనిషత్తులూ
ప్రజాళి కిచ్చిన కేరళభాషను
వికృతమయమని ఎవరా అన్నది?

పరభాషద్వారా పరిపూర్ణస్థాయిని చేరుకోలేమని అతను హెచ్చరిస్తాడు. శక్తియుక్తుల్లో మీ భాష వెనుకబడి ఉన్నంతకాలం, ఎప్పుడూ వాడుతూ ఉంటే కలిగే పరిణితి మీ భాషకు కలగనంతకాలం, మీకు చేతకానంతకాలం, మీ ఆలోచనా ధోరణులు పగం పగంలోనే ఆగిపోయినంతకాలం, మీరు విస్మరించబడివస్తే లెక్క'

అని తేల్చేస్తాడు. మలయాళ భాష ఓ పేదఇల్లాలులాంటిదనీ, పిల్లల మంచి పుస్తకాల దాహం తీర్చలేనిదనీ కవి అంగీకరిస్తాడు. అయితే అన్యభాషార్ణవంలో మునిగి తేలే అదృష్టవంతు లుంటారు కొందరు. అందులోంచి తాము వెలికితీసే ఆణిముత్యాల్ని మాతృభాషకి అందించవలసిన బాధ్యత వాళ్ళకి లేదా ?

తల్లిపట్ల విధి విర్లక్షిస్తే
సిగ్గుచేటు అది, కాదనగలమా !
తల్లిభాష తలదాల్చకపోతే
పరిపాలనముకు మనము తగుదుమా ?
తల్లిముందు శిరసొంచకపోతే
తలఎత్తుకు యిక మనగలిగేమా !

భవిష్యత్తుపై కొండంత ఆశతో కవిత యిలా పూర్తిచేస్తాడు కవి :

చెప్పనేల యిక ? జ్ఞానభిక్షకై
ఎవరు వచ్చినా పూర్తి తృప్తి యిట
అనాదినుండీ కేరళదేశం
ఉదారమయమని బహుజన విదితం.

ఈ పద్యం ఒక దృక్పథాన్ని సమర్థవంతగా చాటి చెబుతుంది. ఆ వాఙ్మయ వైభవాన్ని ఆకాశాని కెత్తుతూ మాతృభాషపట్ల ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటించే కవిత యిది. ఆమె సేవలో అంకితమవాలని తెలుపుతుంది. వ్యతిరేక విమర్శలని ముందే ఊహించి నిగ్రహంతో చేసిన సూచన యిది. మాతృభాషమీద మమత అనేది ఓ బలీయమైన భావన. సంప్రదాయతత్వం, జాతీయభావం జీర్ణించుకున్న వళ్ళత్తోళ్ అది మరింత శక్తివంతం చేశాడు. అయితే వళ్ళత్తోళ్ భాషాదురభిమాని కాదు. స్పష్టమైన భావనాపటిమతోపాటు చక్కని గేయరచనా నైపుణికూడా కనిపిస్తుంది ఈ కవితలో.

విశాల విస్తృతిగల వళ్ళత్తోళ్ కవితను యీకొద్ది ఉదాహరణలు ప్రాతినిధ్యం వహించలేకపోవచ్చు. అతని వాక్పరిణతికీ ఆలోచనాధోరణికీ మాత్రం ఇవి మచ్చుతునకలు.

అయిదో ప్రకరణం :

# వళ్ళత్తోళ్ కథాకథన కవిత

వళ్ళత్తోళ్ కవితలో అఖ్యాన కావ్య విభాగానికి చెందినది చాలా వుంది. చిత్ర యోగం అనేది ఓ పెద్ద కథా కవిత. సాహిత్యమంజరి సంపుటాల్లోఉన్న కథాకవితలు కూడా గేయనాటికలు, లేదా కథాకథనాలు అఖ్యానకవిగా వళ్ళత్తోళ్‌కి ప్రఖ్యాతి తెచ్చి పెట్టినవి మాత్రం అయిదు. బంధనాస్థనాయ అనిరుద్ధన్ (చెరసాలలో అనిరుద్ధుడు) శిష్యానుమ్ మకానుమ్ (శిష్యుడూ, పుత్రుడూ) మెగ్దలీన మేరియమ్ (మేరీ మేగ్దలీన్) కొచుసీత (చిన్నారి సీత) అచానుమ్ మకాళుమ్ (తండ్రీ తనయా) అనేవి. అతని కావ్యనిర్మాణదశలోని వివిధ సమయాల్లో రాయబడ్డవి ఇవి, విభిన్నభాగాలుగా ప్రచురితమైనవి. శిష్యరికదశలోకూడా పురాణ ఇతివృత్తాలమీద ఆధారపడిన గణపతి లాంటి అఖ్యానాలు రాకపోలేదు.

1914 లో ఆత్మపోషిణిలోని 'అనిరుద్ధన్' ప్రచురణతో వళ్ళత్తోళ్‌కి మంచి పేరువచ్చింది. ఉషా అనిరుద్ధుల కథ తొల్లిటి మలయాళ సాహిత్యంలో చంపూ, కథాకళి, తుళ్ళల్ బాణీలలో వెలువడినదే. ఈ పౌరాణిక ప్రేమగాథలోని సంఘటన లన్నీ వళ్ళత్తోళ్ ఖండకావ్యంగా మలచాడు. కవిత మొదట్లో దుఃఖంలో తలమునక లయిన ఉష మనకి దర్శనమిస్తుంది, ప్రియుడు అనిరుద్ధుణ్ణి తన తండ్రి బాణుడు బందీచేశాడుగా మరి ! వృద్ధుడూ గౌరవపాత్రుడూ అయిన మంత్రి కుంభాండుణ్ణి ఆమె పిలిపిస్తుంది, అనిరుద్ధుణ్ణి కలుసుకోడానికి అతని అనుమతి కోరుతుంది. అతని మౌనమే అంగీకారంగా తీసుకుని ఆమె చెరసాలకి వెడుతుంది. కవి వారి సమా వేశం వర్ణిస్తాడు, వారి కబుర్లు వివరిస్తాడు, భవిష్యత్తుమీద గంపెడాశతో అదృశ్యాన్ని అలా ముగిస్తాడు.

వాలుగేపి చరణాలు ఉన్న దబ్భై మూడు పాదాల కవిత ఇది. ఈ కథనంలో ఒక్కొక్కప్పుడు వర్ణన, మరొకప్పుడు సంభాషణ సగానికిపైగా ఉత్తమపురుషలో

పొగుతుంది. కథాకథన శిల్పంకన్న నాటకీయత ఎక్కువ. ఉష కుంభాండుడితో ఎంతో విగ్రహంతో మాట్లాడుతుంది, అయినా ఆమె దుఃఖం, ఆక్రోశం బయటపడి పోకుండా ఉండవు. అనిరుద్ధుడికే కారాగారశిక్ష తప్పనప్పుడు తనకి మరణశిక్ష కంటె తక్కువ శిక్ష అన్యాయమంటుంది.

ఎప్పుడో ప్రాణం తీసేశారు
వెయ్యకుండానే మరణశిక్ష
ఇంకా ఎందు కిలా సాధిస్తారు
ఎక్కడలేని కక్ష ?

అంటూంటే ఆమె గొంతుక దగ్గదిక మూతుంది, మాట్లాడలేక, గుండె బ్రద్దలై పసిపాపలా బావురుమంటుంది. ఉష తనని చూడ్డానికి చెరసాలకి రావడంలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొన్నందుకు అనిరుద్ధు డెంతో బాధపడతాడు:

ఎంతలేనివానికయిన పెళ్లి పండుగ
సొంత యింటిలోన జేర్చు సతిని హాయిగ
దీనుని నను ఎంచినావు తోడు నీడగ
విన్నవారు, కన్నవారు మేలమాడగ
నెలత! నీకు మెట్టినిల్లు నేలమాళిగ!

అతని కన్నీళ్లు దుర్భరవేదన కింద మారుతాయి:

వేయి శరములకైన వెరపు ఎరగని నేను
ఒక్క నీ అశ్రువుకు ఓర్వలేకున్నాను!

తనతో చెరవీడి రమ్మనే ఉష పిలుపును అతడు తిరస్కరిస్తాడు:

చెరవీడి పర్వెత్తు చోరుడా మగడు?
బెదురుతో నీ గుండె చెదిరినట్లున్నది!
యాదవుల కోడలవు తగునటే అదటు?
జాలితో నీ శక్తి సడలినట్లున్నది!
నీ క్రొత్త బంధువుల ధాటి వినలేదా?
నాదు విడుదల ఘడియ త్వరగవస్తున్నది!

ఆమెను ఓదారుస్తాడు·

ప్రేమ బీజము నాటె తానె ఈశ్వరుడు
పెకలించివేయునా! బేల! భయపడకు,

సంప్రదాయ శృంగారంలోని మొరటుతనం లేని ఉదాత్త మనోహర ప్రేమ కనిపిస్తుంది ఈ కవితలో. కవి కేవలం ఓ ఉన్నత మధురభావావేశాన్ని ప్రతిపాదించి ఊరుకోలేదు. పాత్రల్ని సజీవం చేశాడు. పరిస్థితుల దౌర్భాగ్యస్థాయిని కళ్ళకు కట్టించాడు. కుంభాండుడు దయాస్వభావుడు. గౌరవింపతగినవాడు. ఉష పట్ల అతనికి పితృవాత్సల్యం. ఈ విషయం. అతని ముఖకవళికల్ని ముచ్చటిస్తూ నాటకీయంగా చెబుతాడు కవి. ఉషలోని దైన్యం చూడగానే అతను 'స్థంభంలా నిలబడిపోతాడు'. ఆమెని ఓదార్చాలని ఉంటుంది. ఎలాగో తెలీదు! చెరశాలకి వెళ్ళి అనిరుద్ధుణ్ణి కలుసుకుంటానని ఆమె చెప్పగానే మెరపు మెఱుపులా తళుక్కుమంటుంది. అతనిలో, ఆశ్చర్యమూ ఆందోళనా అతని గుండెని రివ్వున తాకుతాయి. ఉషలో గర్వం, కఠినత్వం, రోషం నెలకొని ఉన్నాయి. వేదనతో ఆమె హృదయం ముక్కలైంది, ప్రేమభావనతో నిండి ఉంది. ఇటువంటి ఉషను వర్ణనలద్వారా, ఆమె మాటలద్వారా కవి మనముందు ఉంచుతాడు. ఆలోచనలో మునిగి 'వేదనాభరితమైన మొహాన్ని వంచి, స్వేదంతో తడిసిన నుదుటిని మృదువైన చేతిపై ఆన్చి', ఉష చిత్తరువులా కూర్చున్నదట. కుంభాంధుడు మాట్లాడుతున్నప్పుడు ఆమె కళ్ళ క్రోధంతో అగ్నిబాణాలు కురిపిస్తాయి అంతలో భంగపడి చిన్నపిల్లలా ఏడ్చేస్తుంది. ఆ కన్నీళ్ళే కుంభాండుణ్ణి కరిగించి ఆమెకి చెరశాల ప్రవేశం కలిగిస్తాయి. వెంటనే నేలమాళిగకు పరుగుదీస్తుంది. అనిరుద్ధుడు లేచి ఆమెను దగ్గరతీసుకునేలోగానే అతని ఒడిలో చేరిపోతుంది. ఇక ఆమె కన్నీళ్లు ఆగవు. అతని శరీరంమీది గాయాలు మృదువుగా స్పృశిస్తుంది. అతని బాధలు తలుచుకుంటే వీరపత్నిననే భావన మటుమాయమౌతుంది ఆమెలో. తిరిగి వెళ్ళిపోమని అతను మరీ మరీ చెబుతున్నపుడు తన్నింకా ఉండనివ్వమని ఆమె చేతులు జోడించి బతిమాలుతుంది. ఆమె వెళ్ళక తీరదని అతను వాదిస్తూంటే తనతో వచ్చేయమని ఎంతో సాహసంతో అడుగుతుంది. ఉష మాయామర్మం ఎరగనిది, దుడుకైనది. ఉదాత్త స్వభావం గలది అనిరుద్ధుడు స్థిరచిత్తుడు, ధైర్యవంతుడు. చెరసాలలో ఉన్నా అతని ప్రశాంతతగాని ప్రసన్నత గాని చెక్కుచెదరదు. తనతాత శ్రీ కృష్ణుడి యింట్లో లక్ష్మీకటాక్షంలో సిరిసంపదలతో తులతూగుతున్నంత నిశ్చింతగా ఉంది అతనికి కారాగారంలో. ఉష మీద అతని ప్రేమ అపారం. అయినా ఆ ప్రేమ గంటలతరబడి ఆమెని చెరసాలలో ఉంచడానికిగాని, ఆమెతో చెరసాలనుండి పారిపోడానికిగాని అనుమతించలేకపోయింది. అయితే ఇంతటి ధీరుణ్ణికూడా విచలితుణ్ణి చేసిన క్షణాలు లేకపోలేదు :

కానివేళ అది
కారాగృహమది

తానా ఒంటిది
ఐనా మొండిది!

ఆమె మాటలు వింటూంటే 'ఆతని గుండె చెదిరిపోయింది, శరీరమంతా చెమటతో తడిసిపోయింది. నాసికా రంధ్రాలు పెద్దవయాయి, కళ్లు అశ్రువులతో విండిపోయాయి' చేతులు కట్టుకుని తన దగ్గిరగా నిలబడి బతిమాలుతున్న ఆమెను చూస్తాడు అతను. ఆ చేతులు ముద్దాడుతాడు ఆమెను తన హృదయానికి హత్తుకుంటాడు. ఆవేశంతో గద్గదికమైన కంఠంతో మాట్లాడుతాడు. ఆ స్వరం, ఆ ఆకారం, ఆ చూపులు, ఆ మాటలు - ఏవి పరికించినా మెత్తని హృదయం, ధృఢమైన సంకల్పంగల ఉన్నతుడైన యువకుడిగా గోచరిస్తాడు.

సరళంగా సూటిగా చెప్పబడిన యీ కవిత వివేక విగ్రహాల మంచి కలగలుపు. ఇందులో ప్రతీ పద్యమూ సానబట్టిన రత్నమే.

నాలుగేళ్ళ తర్వాత వెలువడింది 'శిష్యుడూ, పుత్రుడూ' అనే రచన నాలుగేసి పాదాలున్న అరవైతొమ్మిది పద్యాలుగల యీ కవిత యించుమించు 'అనిరుద్ధుడు' అంత పెద్ద రచన. దీని ఇతివృత్తంకూడా పౌరాణికమే. పరశురాముడి దొక్కడిదే మానవ పాత్ర తప్ప తక్కినవారంతా స్వర్గవాసులే. 'అనిరుద్ధుడు' కంటె ఇందులో పాత్రలు ఎక్కువ, దృశ్యాలు ఎక్కువ. ఆలోచనాధోరణులు ఎక్కువ. అందుచేత సజీవనాటకీయతకూడా హెచ్చు. అలకాపట్టణపు బాటలగుండా పరశురాముడు శివనివాసమైన కైలాసంవైపు నడిచే దృశ్యవర్ణనతో కవిత ఆరంభమౌతుంది. అందరూ ఆతన్ని గురించి ఏమనుకుంటున్నారో వింటే మనకి పరశురాముడి గొప్పదనం అర్థమౌతుంది. అతను ముందుకి పోగుతూండగా పురజనులు,

ఎంత పన్లో ఉన్నవారైనా సరే
ఎక్కడివాళ్ళక్కడ బంద్.
ఎంత గొడవ జరుగుతున్నా సరే
ఎక్కడి కక్కడ గప్‌చుప్.
కూచున్నవాళ్ళు ఎవరైనా సరే
లేచి నిలుచున్నారు టక్కున.
వెడుతున్నవారు ఏపనై సరే
ఆగి దారిచ్చారు చటుక్కున.
పురజనులమాట సరే, మరి పురస్త్రీలు

లక్షలాది
యక్షస్త్రీలు
అతివ లాంటి
సుతువి గౌరి
మనసు విచ్చి
కనులు విచ్చి
గుచ్చి గుచ్చి
మెచ్చి మెచ్చి
చూపి చూపి
చూపు పూల
నరులుంచిరి
పులకించిరి

వీధి వీధంతా నిశ్శబ్దమైపోయింది. గౌరవంతో భయంతో ప్రశంసతో ఉక్కిరి బిక్కిరయింది. అతను కైలాసం చేరుకుంటాడు. శివనివాసపు ముందు వాకిలిలో గణపతినీ సుబ్రహ్మణ్యుణ్ణీ చూస్తాడు. విధేయతతో వారి నోమారు పలకరించి తొందరగా ముందుకి సాగిపోతూంటే గణపతి 'ఎందుకయ్యా తొందర ? నాన్నగారు లోపల విశ్రాంతి తీసుకుంటున్నారు' అంటూ అటకాయిస్తాడు. సుబ్రహ్మణ్యుడుకూడా అడ్డు చెబుతాడు :

కనుమూసి ధ్యానాన ఉండగా గురువు
పోతగునె లోనికి శిష్య పరమాణువు ?
పొందవలదే ముందు తగిన ఉత్తరువు ?

దానికి పరశురాముడు చెప్పిన జవాబు శిష్యుడికి గురువు దగ్గిర ఆమాత్రం చనువు ఉండకపోదని. అలా చెబుతూ లోపలికి చొరబోతే మళ్ళీ గణపతి అడ్డుకుంటాడు. ఆ మీదట వాళ్ళిద్దరికీ దెబ్బలాట అవుతుంది. శివుడి అనుచరులైన 'భూతాలు' చూస్తూ ఉంటారు. గణపతి తన తొండంతో పరశురాముణ్ణి పట్టి గిరగిర తిప్పుతాడు :

బొజ్జగణపతి చేత మౌని బొంగరమాయె
ముజ్జగాలూ కనులముందు గిర్రున తిరిగె

కాని వినాయకుడు తప్పు అంచనా వేశాడు- ఈ అవమానంతో పరశురాముడికి చిర్రెత్తుకొచ్చింది. 'ప్రాచీన భారతీయరక్తం అవమానం సహించదు.

బ్రహ్మ రుద్రాదులు ఎదురైనా సరే'. శివుడు ఒకప్పుడు అనుగ్రహించిన దివ్యాస్త్రం, కృపాణం తీసి గణపతి మీద ప్రయోగించాడు పరశురాముడు. అది గణపతి చెంపని తాకింది పిడుగులుపడే చప్పుడుతో దంతం తెగి క్రింద పడింది :

మనవడి పతనం మనసు దహింపగ
హిమాచలమ్మే తలను ఎత్తెనన
ఎట్టని భూమికి ఎత్తుగ తలవిడి
కైలాసమ్మే కలవరపడెనన
జరిగిన హింసను సహింపజాలక
కర్మసాక్షియే కందిపోయెనన
స్కందుడు నవ్వగ నంది నొవ్వగా
వీరభద్రుడే త్రిశూల మూపగ
రుద్రుడు ఉస్సురన చండుడు తడబడ
కుంభోదరుడే చేతులు నలపగ
సమస్త లోకం దిగ్భ్రమ చెందగ
రక్త సిక్తమై దంతమూడిపడె.

ప్రమథగణాల హాహాకారాలు విని, గణపతి తల్లి తండ్రులూ, జగతతి తల్లి తండ్రులూ అయిన పార్వతీ పరమేశ్వరులు అక్కడి కొస్తారు, పరుగు పరుగున. రక్తమైన గణపతిని చూసి అతన్ని తన ఒళ్ళోకి లాక్కుంటుంది పార్వతి. పరశురాముడు శివుడి కాళ్ళమీద పడతాడు. జరిగిందేమిటో తల్లితండ్రులకి వివరిస్తాడు సుబ్రహ్మణ్యుడు. పార్వతికి ఒళ్లమండిపోతుంది. ముందుకి పడుతున్న కేశరాశిని ఎడం చేత్తో వెనక్కితోస్తూ నిప్పులు కురిసే చూపులతో మొగుడిమీద విరుచుకు పడుతుంది :

గురువంటే తమ శిష్యుని కెంత గౌరవం !
ఈనాటికి కళ్లబడింది కనుక తరించాం
దివ్యాస్త్రాలేవైనా మిగిలి ఉంటాయి,
దీవించి యివ్వండి సఫలమౌతాయి !
ఉంటేనే చస్తేనేం ముద్దుల కొడుకు
దొరికాడుగ మదికింపుగ శిష్యుడు ఒకడు !
అతడెంతో గొప్పవా డన్నారు, అవునా ?
అయోగ్యులకు విద్యాదానం తగునా ?

ఆమె విస్తార వచనాలు ఇలా సాగుతూనే ఉంటాయి. జగదీశ్వరుడైన శివుడికే ఏం చెప్పడానికీ పాలుపోదు. ఆ విషాద వాతావరణంలోకి ఎక్కణ్ణుంచో దివ్య మురళీ గానలహరి వచ్చిపడుతుంది. కైలాసంలోని ప్రతిఒక్కరికీ అతులమైన ఆ అమృతగానం సుఖశాంతులు ప్రసాదిస్తుంది. గానంతోపాటు గాయకుడూ వస్తాడు. అతనెవరోకాదు, రాధాద్వితీయుడైన శ్రీకృష్ణుడు. రాధాకృష్ణుల కాంతి ఎంత గొప్పదంటే వెలుగులు విరజిమ్మే శివుడుకూడా వారిముందు 'దినకరప్రకాశం ముందు దీపంలా' వెలవెల బోతాడు. ప్రకాశమానమైన పదాళితో వారి సౌందర్య చిత్రణ చేసే ప్రయత్నం చేస్తాడు కవి :

నగుమోము కలవాడు నల్లనల్లనివాడు
మేటి ఆటలవాడు మెరుపు వలువలవాడు
మురళి పట్టినవాడు మౌళిపింఛమువాడు
సంపెంగ పువుబోడు సఖిని కూడినవాడు

ఇక, మంచిముత్యం లాంటి మెరుస్తున్న తెల్ల చీర కట్టుకున్న రాధ మొహంలో చూస్తే....

ఇనుడు పొడిచిన వేళ
కమల కళకళల లీల

ఈ అందమైన జంటకి కైలాసం నవ్వుతూ స్వాగతం పలికింది. అతిథుల కాళ్ల మీద అందరూ పడతారు. పార్వతి క్రోధం తలుచుకునో, గణపతితో స్నేహం చెడిపోయిందనే ఆలోచనతోనో, పరశురాముడు మొహం వెలవెలబోతుంది. రాధా కృష్ణులు అతనిపై కరుణారసదృక్కులు ప్రసరిస్తారు. రాధ గణపతి తగ్గరకి వెళ్ళి కన్నతల్లి ప్రేమతో అతన్ని ఒడిలోకి తీసుకుంటుంది. గాయపడిన అతని చెంపపై రాధ అరచెయ్యి తాకగానే గాయం మాయం అవుతుంది. రాగమయి అయిన రాధా సతి అరచేతిలో అమృతముంది మరి. మొహన మురళిని మించిన మధుర స్వరంతో రాధ పార్వతితో అంటుంది .

పిల్లలు తమలో అల్లరి పడితే
తల్లడిల్లుటది తల్లికి తగునా !
రాముని సీపతి శిష్యుని చేసిన
దాదిగ సీదగు పుత్రులు మువ్వురు

అని చెబుతూ ఆ సంతతిలో పరశురాముడి ప్రత్యేకత యిలా చెబుతుంది :

పురిటి నొప్పులు లేక పుట్టుకొచ్చిన ఘటము
అతవినే మిన్నగా ఆదరించుట నయము

పార్వతి తన కోపం తగ్గించుకొనే తీరు కవి యిలా వివరిస్తారు :

భావగర్భితమైన భర్త నవ్వును పోల్చి,
సిగ్గుతో తలవాల్చి ప్రేమతో దరిచేరి
పాదాల వాలిన రాముని ఒడిచేర్చె.
పదిమంది నొకసారి ఎదిరించు యోధుడు
జగదంబ ఒడిలోన పసిపాపగా ఒదిగె.

ఈ కవితలో, దేవుళ్లను గృహకలహాలలో నిమగ్నులయే మానవమాత్రులుగా తీర్చిదిద్దడం జరిగినా, అయినా దేవుళ్ల వారి దైవశక్తుల్ని పూర్తిగా కోల్పోయినట్టు చూపెట్టబడలేదు జరుగుతున్న విషయాలలో వాటిపాత్ర సూచిస్తూ సమస్త విశ్వాలనూ పదేపదే ఉదహరించడం; పార్వతీ పరమేశ్వరుల్ని జగత్తు కంతటికీ మాతాపితలుగా చూపే విశేషణాలు వాడడం. ఈశ్వరుడు, అష్టమూర్తి, మహాదేవి అనే పదాలు ఉపయోగించడం, రాధాకృష్ణుల దివ్యసౌందర్యాన్ని వర్ణించడం-ఇవన్నీ దేవుళ్లను దేవుళ్లుగా నిలబెట్టేందుకు గగనానికెత్తే సాధనాలు. ఉన్నతమైన శైలి కూడా ఇందుకు తోడ్పడింది. జానపద, పౌరాణిక సంప్రదాయాల్లో దేవుళ్లు మనుషుల్లాగే ప్రవర్తిస్తారు. ఈ దివ్యమూర్తుల్ని యిలా తెలిసినవాళ్లలా 'మచ్చికచేసి' చిత్రించినందుకు భారతీయ హృదయం ఏం నొచ్చుకోదు. భారతీయ మనస్తత్త్వంలోని యీ మూలప్రకృతిని ఎంతో నేర్పుతో చిత్రిస్తాడు వళ్లత్తోళ్. ప్రతీ పద్యంలోనూ వేవేల సొగసులు వెల్లి విరియడంతో ఈ కవిత మహనీయ కళాఖండంగా రాణకెక్కింది. దీన్నొక మనోహరమైన నాటకంగా పేర్కొన్నా తప్పులేదు. ఎందుచేతనంటే ఇందులో - వెరపెరగని పరశురాముడు, ఉల్లాసం కలిగించే గణపతి, గడుసరి సుబ్రహ్మణ్యుడు, కోపదారి పార్వతి, విస్తుపోయిన ఆమె పెనిమిటీ, జవజీవాలు ప్రసాదించే శాంతి సంధానకర్తలు రాధాకృష్ణులూ—ఇలాంటి పాత్రలున్నాయి. అలకాపురి వీధులగుండా పరశురాముడి రాక, శివపుత్రులతో అతను తలపడడం, కలహం, గణపతి తన తొండానికి చుట్టబెట్టి అతన్ని గిరగిరా తిప్పడం, గణపతి దంతాన్ని విరకొట్టడం, ప్రమథగణాలు పరిచారకాలుగా బాధపడడం, పార్వతి మండిపడే కోపం శివుడు తెల్లబోవడం, రాధాకృష్ణుల రాక, పార్వతి చల్లబడడం చూసి శివుడి మందహాసం - ఇలాంటి దృశ్యాలున్నాయి.

'అనిరుద్ధన్' లోనూ 'శిష్యానుమ్మకానుమ్' లోనూ నాటకీయత ప్రధాన లక్షణం. వాటిని సులువుగా నాటికలుగా రూపొందింపవచ్చు. స్వరాలలో వివిధ రీతుల్నీ స్పష్టమైన ముఖకవళికల్నీ, నిర్దుష్టమైన కదలికల్నీ అవి సూచిస్తాయి. ఇవన్నీ ఇతివృత్తానికి చక్కగా సరిపోయేటట్టు సజీవంగా భాసించేవి. ఈ రెండు కవితలూ స్వచ్ఛమైన శయ్యాసౌందర్యంతో నిండి ఉన్నవి. ప్రతి చిన్న విషయానికీ ప్రాముఖ్యత ఇవ్వడంచేత మొత్తంమీద దిట్టంగా నిలబడ గల కవిత లివి.

కొంతమంది క్రైస్తవ మిత్రులు కోరిన మీదట తన తరువాతి కథన కవితకి బైబిల్‌నుంచి ఇతివృత్తాన్ని ఎంచుకునాడు వళ్ళత్తోళ్. లూక్ ప్రవక్త బోధలుగల ఏడవ ప్రకరణంలోని మేరీ మేగ్డలీన్ కథ ఇది. వళ్ళత్తోళ్ 'మేగ్డలీనా మేరియమ్' 1921 లో ప్రచురించబడింది. అతని కథాకథన కవితలో ఇది అత్యుత్తమమని పేరు తెచ్చుకొన్నది. 'అనిరుద్ధన్', 'శిష్యానుమ్ మకానుమ్' ల వలె కాక ఇది ద్రవిడ ఛందస్సులో రాయబడింది. సాహిత్యమంజరి కొన్ని పద్యాలలో జయ ప్రదంగా ఉపయోగించబడిన చక్కని గేయ ఛందస్సు ఇది. ఇందులో మొత్తం అయిదు భాగాలు. మొదటి భాగంలో సైమన్ యింట్లో క్రీస్తు, రెండో భాగంలో మేరీ క్రీస్తుని చూడ్డానికి వెళ్లడం, మూడో భాగంలో మేరీ గతం, నాలుగో భాగంలో క్రీస్తు బోధనలు విన్న మేరీలో పరివర్తనా, ఆఖరి భాగంలో మేరీ క్రీస్తుల కలయికా- వర్ణించబడ్డాయి. కవితని అయిదు భాగాలుగా విభజించడం, సమృద్ధమైన వర్ణనలూ, మృదువుగా సాగే కథాకథనరీతీ, తగిన భావచిత్రణా, పద్య పాదాలలోని చెప్పిన చక్కదనం, నడకలో ముచ్చటైన నిండుదనం – ఇవన్నీ కలసి వళ్ళత్తోళ్ యీ కవిత పట్ల తీసుకున్న శ్రద్ధ చెప్పక చెబుతున్నాయి

మొదటి దృశ్యంలో క్రీస్తు సైమన్ యింటికి వస్తాడు. కాని ఆ ధనికుడి ఆహ్వానంలో అట్టే సహృదయత కనబడదు. క్రీస్తుముందు అతను మోకరిల్లడు, కాళ్లు కడుక్కోడానికి నీళ్లు యివ్వడు, క్రీస్తు చేతిని ముద్దు గొనడు:

సమస్త జగతికి సంపద పంచే
దివ్య హస్తమును ముద్దు గొనుటకై
నడిమంత్రపు సిరి మిడిసిపాటుచే
అహంకరించిన శిరస్సు వంగునె!

కృష్ణుడు స్నేహితులతో బృందావనంలో మల్లె, సంపెంగ, అశోక పుష్పా లతో నిండిన అటవీస్థలిలో కూర్చున్నట్టు క్రీస్తు తన స్నేహితులతో పంచరంగుల

పట్టు తివాచీమీద కూర్చుంటాడు. తన దివ్య హస్త స్పర్శచే మంచినీటిని మధువుగా మార్చగల క్రీస్తు ముందు సైమన్ భృత్యులు మధురఖాద్యాలు ఉంచుతారు. పక్షులు అతని ప్రశంసాగానం చేస్తాయి. సుగంధ మందపవనాలు అతన్ని సేద తీరుస్తాయి. అతని ఒత్తైన జుత్తూ, గుబురు గెడ్డమూ చూస్తే, కవి వాక్యాలలో 'అతని ముఖ కమలంపై మూగిన తుమ్మెదలు కొద్దిగా కదలి కల్లోలిత కాళిందీ తరంగాల్ని గుర్తు చేస్తున్నవి' అతను చేసిన అద్భుతాల వివరణా, 'మహేశుడని' అతన్ని ఉదహరించడం - యిలాంటివి మినహాయిస్తే క్రీస్తు సంప్రదాయ ధీరలలితనాయకుడిగా గోచరిస్తాడు. అందమైన ఆరాత్రి చక్కని ఆ ముంగిటగదీ ప్రేమదృశ్యానికి అనువైన వనిపిస్తుంది. 'నాయకుడి'గా క్రీస్తు, 'రక్షకుడి'గా క్రీస్తు - యీ రెంటినీ సరిసమంగా చిత్రించడంలోనే కవి సూక్ష్మమైన నేర్పు ద్యోతకమౌతుంది. రెండవ దృశ్యంలో నాయిక దర్శనమిస్తుంది

మిల మిల మెరసే చుక్కల్లారా,
వెల వెల బోతూ పూస్తున్నారా!
మిక్కిలి సుందరి సీమ అందరిలో
టక్కున క్రిందికి జారిపోయెనా!
భూమికి గెంతిన చక్కని చుక్క
భూసతి కొప్పున మల్లెల మొగ్గ

ఇక్కడ ఆమె సౌందర్య వివరణ వివయాసక్తంగా కవిపిస్తుంది. ఆమె ఒంపు సొంపులూ, దట్టమైన ముంగురులూ, మేని గుబాళింపులూ _ పీటివైపు కవి మనదృష్టి మరలిస్తాడు. ఆమె తన ప్రియుణ్ణి కలుసుకోడానికి వెడుతోంది. కాని ఆమె మొహంలో వెరపుగాని సంకోచంగాని కనపడవు. ఆమె భయపడ్డానికి కారణమేమీ లేదు, ప్రతీ ప్రాణీ కలుసుకోవాలని తహతహలాడే క్రీస్తునే ఆమె చేరబోయేది. మేరీ సైమన్ సౌధం చేరుతుంది. తెరిచిఉన్న తలుపులుచూస్తే స్వర్గద్వారమనినించింది ఆమెకి. సముద్రాన్ని చేరేముందు నదీప్రవాహం మందగించినట్టు అక్కడివరకూ అతిత్వరగా వచ్చిన ఆమె నడక వేగం తగ్గుతుంది మళ్ళీ ఒక్కసారి, ఇంచుమించు పరుగువేగంతో, ఆమె మెట్లెక్కి, గుమ్మం ముందు మరొక్కమారు ఆగిపోతుంది. తటపటాయించవలసిన పనేం లేదు, నువ్వు లోపలికి వెళ్ళొచ్చు అనే ధోరణిలో కవి ఇలా అంటాడు :

**నీ కాళ్ళ కంటిన నేరాల బురద**
**నీ కంటి కన్నీరు కడిగెనే, ప్రమద!**

తర్వాతి భాగం ఆమె గత కళంకిత కంటక మార్గం చూపిస్తుంది. పేదరికా నికి పేరుపడిన ఓ పూరిగుడిసెలో మేరీ జన్మించింది అయితేనేం అందాల వారాశి ఆమె. కఠినశిలమీద గులాబి ఎలా వికసించిందో ఎవరు చెప్పగలరు! ఆ చక్క దనానికి యౌవన సిరి అందంగానే వయసుగాళ్ళందరూ ఆమెను చుట్టు ముట్టేరు. వాళ్ల కామదాహం ఆమె పతనకారణమైంది. ఈ కామాతురసంబంధాలపై ఆమె అంతరాత్మ మొదట్లో తిరగబడింది. కాని ఆమె అందచందాల ప్రశంసలో ఆ గొంతుక కూరుకుపోయింది :

ఒకనాడు మరియమ్మ
తిన తిండి ఎరగదు!
ఈ నాడు తనముందు
మహారాణి నిలవదు!
మగువ తెగువను చూపి
సొగసమ్మవలెగాని
భోగ భాగ్యాలకు
లోటు ఉంటుందా!

ఇటువంటి పాపాత్మురాలికి మంచి వైపు మనసెలా మళ్ళిందని? అమృతపు చినుకు మోసుకు వచ్చే మంద వాయువులా ఎక్కణ్ణుంచో క్రీస్తు బోధన వచ్చి ఆమె చెవిలో పడింది. అంతే. మురళీగానం విన్న బృందావని హరిణిలా ఆమె చకిత అయిపోయింది. ఆ జగద్గురువుబోధన మనస్సుకెక్క తన జీవితమెలా ఉందో చూసుకోమని ఆమెని కట్టడి చేసింది. పాతివ్రత్యం అన్నది ఆమె జీవితంలో లేని మాట, అది తలచుకుంటే ఆమె భయకంపిత అవుతోంది. పరిచితస్థలాలే భయావ హాలు అయాయి. ఆ భవనం ఓ నరకం, ఆమె పూలపాన్పు ముళ్ల దారువు, నౌకర్లు యమకింకర్లు. బతుకు ఓ బితుకు బితుకు ఎడారి. పీడకలలూ వెర్రి ఆలో చనలూ ఆమెను వెంబడించి పీడించాయి. బంగారు నావలో రాజవైభవాలతో పయ నిస్తున్న తనని సైతాను నడుపుతూ సాగరమధ్యంలో మండే నిప్పులలో తోసే శాడట నిస్సహాయమై నిలువునా నీరై గొల్లున ఏడ్చిందిట తను .

రోదించు హరిణాక్షి రోదించవే!
రోదించ మన క్రీస్తు ఓదార్చులే!

అనే అనునయవాక్యాలు వినిపించాయి ఆమెకి. తన పడుపు సంపాదన అంతా బీదవాళ్లకి పంచియిచ్చి శేషజీవితం ప్రార్థనలో గడుపుతుంది మేరీ.

ఆఖరి భాగంలో మేరీ క్రీస్తుల సమాగమం చూస్తాం మనం. క్రీస్తు సన్నిధి చేరి అతని పాదాల మీద పడుతుంది. పూర్తిగా దైవదత్తమైన ఆమె ప్రేమ కన్నీటి రూపాన ప్రవహిస్తుంది, క్రీస్తు పాదాలు కన్నీటితో కడుగుతుంది, పట్టు లాంటి కేశరాశితో తుడుస్తుంది, పవిత్రమైన అధరాలలో చుంబిస్తుంది.

తగిన చోట ముద్దుగొనుట ధన్యత నొందె
తరుణి మేరి అధరసీమ పుణ్యము చేసె

అప్పుడు తను తెచ్చిన అరుదైన అగడనూనె అతని తలకి రాస్తుంది. ఇంతకీ సువాసన పుట్టినిల్లు ప్రసూనమూ దాని పరిమళమూ ఆ ప్రభువు కానుకే గద!

ఆమె అంటుంది :

నీ ఆన జవదాటి నేరాలు చేశాను
ఇకముందు నెరనమ్మి నీసేవ చేస్తాను
లోకాలు ఏలేవు లోపాలు ఎంచకు
చీకాకు చెందకు శోకాన ముంచకు
పాపాలు ఎన్నెన్నొ చేశాను, నిజమే!
అది తల్చి నవ్వేడుట ఆపి నీకు ఘనమే?
శిఖినైన చల్లార్చు సిద్ధహస్తుడవే
ఇకనైన ఈదీన నేలుకోవేమీ?

అంధకారంలో కొట్టుకుంటున్న ఆమెకి అతని మందహాసం ఆశాకిరణం లాంటిది. అతను అంటాడు :

బాలా! మానుము ప్రబలరోదనము
నీ విశ్వాసమె నీకు రక్షణము
జరిగిన దోషము తొలగెడు మార్గము
పశ్చాత్తాపమె ప్రాయశ్చిత్తము

ఈ కవితలో ఉన్నవి మూడే మూడు పాత్రలు, సైమన్, మేరీ, క్రీస్తూ. సైమన్ ఒక్కమాట మాట్లాడడు. అంతగా ఉత్సాహం చూపించని అతని ఆహ్వానం చూస్తే అనిపిస్తుంది, ఏదో కేవలం మొక్కుబడికి క్రీస్తుని పిలిచాడా లేక తన ధన ధాన్యాలూ సిరిసంపదలూ చాటుకోడానికా అని. మేరీకి తన యింట్లో ప్రవేశంలేదని అతను స్పష్టంచెయ్యడం చూస్తే అతదొక సచ్ఛీలుడైన లౌకికుడనీ, కొంత కఠినుడనీ అర్థమౌతుంది. విశిష్టమైన నాటకీయశిల్పంతో వీలయినంత తక్కువగా చెప్పి సైమన్ గుణగణాల్ని సూచాప్రాయంగా చెప్పేదు వళ్ళత్తోళ్, ఇక క్రీస్తు పాత్ర?

అది మానవ, దైవ లక్షణాల కలగలుపు మనకి సమీపంగా ఉంటాడు కనుక అతను మనిషి. అద్భుతాలు చేస్తాడు గనక, పాపప్రక్షాళనం గావించే పరమాత్ముడు గనక, అతను దైవం. ప్రేమ భక్తి తన్మయతలు ప్రేరేపించే కృష్ణుడిలా అతడూ ఓ దివ్య ప్రేమికుడు. ప్రేమతో వేదనతో పశ్చాత్తాపంతో క్రీస్తు పాదాలపై పడి క్షమాభిక్ష కోరే మేరీ చివరి దృశ్యంలో మనస్సు ఎంతో కదలిస్తుంది.

జీవితంలోని అతి ముఖ్య దృక్పథాల్ని స్పృశించే ఏ కవితలో అయినా వికరమైన నాటకీయత కనిపిస్తుంది. అయితే అది అందులో ఉన్న మానసిక సమస్యలూ నైతిక విషయాలూ ధైర్యంగా చెప్పగలిగినప్పుడే అయితే పళ్లత్తోళ్ కవిత అందుకు సాహసించదు. సంఘటన చలనాన్ని మాత్రమే చిత్రించగల రూపకం లాంటిదిఅది. అంతకంటె లోతుగాపోయి నేరమనస్తత్వం, పశ్చాత్తాపం, పరివర్తనా వరళి యిలాంటి భోగట్టాలు యిచ్చేదాకా వెళ్లదు. కావ్యరచనా ధోరణిలో సన్నివేశాల బాహ్యదృక్కోణాలతోనే సరిపెట్టుకుంటాడు, అతను, సాధారణంగా.

ఈ కవితలో గానసౌలభ్యం, రూపుకట్టే వర్ణనలూ, నాటకీయతలోని ఒయారపు నడకలూ, సరళంగా సూటిగా అనుభూతులు వివరించడంలోని హృదయంగమ శైలీ - ఇన్నీ ఉన్నాయి. ఇవన్నీ ఉండబట్టే ఇదొక మధుర మనోహర కావ్యమైంది. గగనసీమలకు ఎత్తినట్లు చెప్పాలి, ఇది బైబిల్ ఇతివృత్తం గనక. మనోజ్ఞంగా చెప్పాలి ఇందులోని ప్రధాన రసం ప్రేమ భక్తి గనుక ఈ రెండూ ఇందులో ఎక్కువపాళ్ళలోనే కనిపిస్తాయి మేగ్దలీనా మేరియమ్ లోని శైలి కూడా స్వచ్ఛమైనది. ఇన్ని కలిశాయి గనుకనే ఇదొక కమనీయ కళాఖండంగా నిలిచింది.

1928 లో ప్రకటితమైన కొచు సీత (చిన్నారి సీతమ్మ) అనేది పళ్లత్తోళ్ తరువాతి ఆఖ్యాన కవిత. చిన్నారి సీతమ్మ పేరు చంపకవల్లి. రామాయణం వల్ల ప్రబోధిత ఐ, సీతలా పవిత్ర, శీలం పాటించాలనే కోరికగల నాట్యగత్తె ఆమె. పవిత్ర జీవనం ఆమె కెంతో కష్టమౌతుంది, అమ్మమ్మ ఆమెను వారి కులవృత్తి ఐన వ్యభిచారంలోకి దింపాలని ప్రయత్నిస్తుంది గనక. చంపకవల్లి సీతను ఆదర్శంగా తీసుకోడం చూసి వాళ్ళ అమ్మమ్మ మండిపడుతుంది. దేవదాసి జీవనంలోని గుట్టు మట్లు నూరిపోస్తూ ఆఖర్న ఇలా అంటుంది .

ఈ పాతివ్రత్యం అనేది ఓ ఇబ్బంది
అది అందంలేని వాళ్ళకే చెల్లింది

నీ సంపెంగతనువు నిగారింపూ గుబాళింపూ చూసి
మోసం ఉన్నా ఎవ్వడూ ఒకడూ వస్తున్నాడు గుటకలేసి
వాసన లేని పూవ్వులా నీకేం కష్టం!
పాతివ్రత్యం నీకెలాంటి ధర్మం!

కాని చంపకవల్లి వయసు పెరిగినకొద్దీ సీతపట్ల భక్తి తత్పరతా పాతివ్రత్య ఆదర్శంపట్ల ఉత్సుకతా ఎక్కువ అవులాయి. ఓనాటి రాత్రి, అమ్మమ్మ గదిలోకి పంపగా, ఉత్సాహంతో జోరబడుతున్న విటుణ్ణి ఎలాగో తప్పించుకుని ఇల్లు విడిచి పారిపోతుంది. పదిరోజుల తర్వాత అమ్మమ్మకి ఉత్తరం అందుతుంది. మనవరాలు ఆత్మహత్య చేసుకోడానికి నిశ్చయించుకున్నట్టు.

కవి మెరుగుపెట్టిన వనితనానికి వచివనిండా కావలసినన్ని రూపకల్పనలు. ఆరాత్రి అమ్మమ్మ నిద్రిస్తున్న తీరు ఇ పకి ఎలా కనబడిందో చూడండి

పక్కకి తిరిగి ఒత్తిగిలి పడుకున్న ముసిలి
పదును తరిగి విరిగిన మదనుని ములికి

చంపకవల్లి లేచికూచుని, రామాయణ గ్రంథం ఓమారు తిరగేసి, దాన్ని జాగ్రత్తగా దాచుకుని, ఇల్లువిడిచి వెళ్లే ఘట్టం వర్ణన యిది

యౌవన సిరితో ఊపిరి సలపని
పయ్యెద మాటున పొత్తము దాచెను
ఇంచుక ఓరగ నెలతుక మోమిడ
వంగిన పద్మము భంగిమ తోచెను
సరిగంచులలో సరసము లాడుచు
అరుణ పాదములు కుంకుమ జల్లెను

శీలంకోసం ప్రాణత్యాగం చేసిన భారతనారీమణుల పద్ధతిలో సాగుతుంది ఆమె ఆఖరిలేఖ. తను ఎందుకు చనిపోవలసి వచ్చిందో చెబుతూ చివర్న 'తల్లీ, భారతీ! ఇదే నీకు నా చివరి పాదాభివందనం. మళ్ళీ నాకు జన్మంటూ ఉంటే నీ ఒడిలోనే పుట్టాలి. నా సోదరీమణులందరికీ పరాధీన బ్రతుకులు తప్పిపోవాలి. అలా దీవించు తల్లీ!' అని ప్రార్థిస్తుంది.

ఉత్సుకత రేకెత్తించే కవిత ఇది. అయినా తక్కిన వాటికన్న నాటకీయత తక్కువ ఇందులో. చివరిలేఖ మరీ పెద్దదిగా ఉండి ఉపన్యాసధోరణిలో సాగడం వల్ల కొంతవరకు కళాభిజ్ఞత దెబ్బతింది.

1941లో వళ్లత్తోళ్ అచ్ఛానుమ్ మకానుమ్ (తండ్రీ తనయా) రాశాడు. పుట్టగానే తను విడిచివెళ్ళిన శకుంతల్ని విశ్వామిత్రుడు కలుసుకొనే ఊహాకల్పన ఇది. భర్తచే పరిత్యక్త అయిన శకుంతల హిమాలయాలలోని కశ్యపాశ్రమంలో ఉంటుంది. ఆశ్రమానికి ఆనుకుని ఉన్న అరణ్యంలో ఆమె కొడుకు సర్వదమనుడు ఆడుకుంటూ ఉంటాడు. ఓ రోజు విశ్వామిత్రుడు కశ్యపమహామునిని చూడ్డానికి వస్తాడు. ఓ అశోకవృక్షం కింద విశ్రాంతి తీసుకుంటూ, కశ్యపుడు ఆశ్రమంలో ఉన్నాడో లేదో చూసిరమ్మని శిష్యుణ్ణి పంపిస్తాడు విశ్వామిత్రుడు. అక్కడ అతనో చిన్న కుర్రాణ్ణి కలుస్తాడు. 'మా తాతగారి దగ్గిరకి నేను తీసుకెడతాను రండి' అంటాడు ఆ బాలుడు. కశ్యపుణ్ణి తాతగారని పిలిచే ఆబాలు డెవరా అని విశ్వామిత్రుడు విస్తుపోతాడు. ముద్దులొలికే ఆ పసివాణ్ణి చూసి మరి ఆగలేక రెండు చేతులా ఎత్తి గుండెకి హత్తుకుంటాడు :

పసి సన్యాసివి పొడవు ముంగురులు
ముని గెడ్డానివి ముళ్ళ తీవియలు
ఆముని బాలుని హత్తుకొనగనే
గెడ్డం కేశం చిక్కులు పడినవి!
విరాగి బతుకున సరాగ మొలికెను
తాపసి ఆపసి వలలో చిక్కెను!

అప్పుడు కవి కొంటె నవ్వుని దాచుకుంటూ ప్రశ్నిస్తాడు :

ఒక్కటడుగుతాను చెప్పు తపోనిధీ!
ఏది నీకెక్కువ సంతోష మిచ్చేది,
నీవు ధ్యానంచేసే సచ్చిదానందమా
విన్ను మత్తుని చేసే పిచ్చివ్యామోహమా?

కొడుకుని వెతుక్కుంటూ తల్లి వస్తుంది. దీనంగా చూస్తోంది. 'చక్కనమ్మ చిక్కినా అందమే' అన్నట్టుంది ఆమె. 'ఇదిగో అమ్మా ఇక్కడా నేను!' అని కేకేస్తాడు కుర్రాడు. అయితే తల్లిని కలుసుకునేలోగా మరో ఆకర్షణ అడ్డువస్తుంది అబ్బాయికి. కాళిదాసు చెప్పిన రంగుల నెమలిబొమ్మ అది. మార్కండేయుడి చేతిలో దాన్ని చూసి అటు పరిగెడతాడు సర్వదమనుడు. ఆ యువతిలో మేనక పోలికలు చూసి ఒక లిప్త నివ్వెరపోతాడు విశ్వామిత్రుడు. 'ఇదేమిటి మేనకా ఇంతలా మారిపోయావు?' అని అడగవలసిందే. కాని 'భూచక్రం ఏలే శుభ

చిహ్నాలు ఉన్న ఆ కర్రాడి తల్లివి నువ్వేనా అమ్మాయ్, ఎవరు నువ్వు?' అని అడుగుతాడు. దాని కామె జవాబిదీ:

ఆనాడు నేను పుట్టింది అడవి
అమ్మానాన్న నన్ను పారేసింది అడవి
దుష్యంతుడు నా పెనిమిటి
తండ్రి విశ్వామిత్రు డనుముని

'నేనేనా?' అని తెల్లబోయాడు విశ్వామిత్రుడు. కన్నెదుట ఉన్న అచ్చుగుద్దిన మేనకను చూస్తూ సందేహనివృత్తి చేసుకున్నాడు, అతని కళ్లు అశ్రుపూరితాలయేయి. శకుంతల అతని పాదాలమీద వాలుతుంది. ఆమెని చూసి విశ్వామిత్రుడి ఆనందానికి అవధులు లేకపోయాయి. ఎంతో ప్రేమతో కుశల ప్రశ్నలు వేస్తాడు:

చెప్పవమ్మ చిట్టితల్లి పేరేమిటో
నువ్వుకన్న చిన్నినాన్న పేరేమిటో
రాణివైన నీకు అడవి బతుకేమిటో

గద్గదిక కంఠంతో ఆమె తన గాథ చెబుతుంది. తన మొగుడు తనని వదిలే శాడని చెబుతూ గుండెపగిలి కూలబడిపోతుంది.

త్రిలోకాలనూ నాశనం చేసే శివుడిలా విశ్వామిత్రుడు రుద్రుడయిపోతాడు. అతని కంటివెంట నిప్పుకణాలు కురుస్తాయి ప్రకృతి భయంతో స్తంభించిపోతుంది. కూతురికి జరిగిన పరాభవం అతను భరించలేకపోయాడు. త్రిశంకుడి విషయం లోనూ, హరిశ్చంద్రుడి విషయంలోనూ తన తపోమహిమ ఎంతగా పనిచేసిందో దుష్యంతుడు ఎరుగడా! నిర్దోషి నిండు గర్భిణీ అయిన పత్నిని బయల్నడిపిన ఆ దురాత్ముణ్ణి శపించడానికి అతను సిద్ధమైతే శకుంతల అడ్డుపడింది:

నీ సుత తనపతి చావుకోరునా?
వైధవ్యముచే దగ్ధ మందునా!

అంటూ వారించి, మళ్ళీ అంటుంది:

నాకు జరిగిన ఘోరావమానం
మావాడికి కాకుంటే అదే నాకు బహుమానం

మరోముక్క ఆఖర్న అనకుండా ఆమె ఊరుకోలేక పోతుంది:

అమ్మా నాన్న అనాథ వదిలెయ్యగా లేనిది
అయన యీశాడు ఇవే చేస్తే పాపదేనికి, దయానిధీ?

ఆమె కన్నీళ్ళతో అతని కోపం కరిగిపోతుంది. ఆశీర్వదిస్తాడు:

గుణశీల! నాలోని
క్రోధానలము పోయె
త్వరలోన పతిజేరి
తనియించెదవుగాక!

ఈ కవిత చిన్నదైనా బిగి ఉన్నది. వళ్లత్తోళ్ కవితల్లో సాధారణంగా ఎన్నో సొగసులు గోచరిస్తాయి ఇందులో అవేం కనపడవు. సర్వసామాన్యంగా కనిపించినా ఎంతో హుందాగా ఉంటుంది ఈ కవిత కరినంగా, ఒక్కొక్క చోట కరుణాప్రధానంగా నడుస్తుంది. తండ్రీ తనయలు హఠాత్తుగా కలుసుకోడం హృదయంగమంగా చిత్రించబడింది ఇతర వళ్లత్తోళ్ కథాకథనాల్లోలా నాటకీయత మనోహరంగా పోషింపబడి ఓ రూపకంలా కళ్ళెదుట నిలుస్తుంది కాని ఇందులో పాత్రపోషణ కిచ్చిన ప్రాముఖ్యం బాహ్యాక్రియలకు కనిపించదు. ఓ సన్నివేశాన్ని వర్ణించడానికి గాని ఓ విధమైన వాతావరణం సృష్టించడానికిగాని ఒక్క అక్షరం వాడబడలేదు మనుషుల్లో ఉండే అనురాగాలూ అంతఃకరణలూ చిత్రించడానికి వళ్ళత్తోళ్ ఏ ఇతర కృతిలోనూ చెయ్యనంత కృషి యిక్కడ చేశాడు. ఆయా అనుభూతులు సూటియైనవి, సులువుగా బోధపడేవి, సన్నివేశాలకు సరిగ్గా సరిపోయేవి. కావ్యలక్షణాలను అనుసరించే పాత్రసృష్టి జరిగింది ఇందులో.

ఈ అయిదు ఆఖ్యానాల్లో, ప్రత్యేకించి మొదటి మూడిట్లో వళ్ళత్తోళ్ కల్పనా నైపుణీ, భావనాచాతురీ సర్వజన సమ్మోహనకరంగా పరిణమించాయి. అంతేకాదు, మనస్తత్వాల తికమకలూ ధర్మసూక్ష్మాల శషభిషలూ ఎదురైనప్పుడు టక్కున అతనెలా ఆగిపోతాడో అవే చెబుతాయి. ఈ లోటుపాట్లు ఉన్నప్పటికీ జిగీ, జీవం గల యీ కవితలు ఇతివృత్తానికి న్యాయం చేకూర్చేవి. ఎప్పటివో పాత సన్నివేశాల్ని కళ్లముందు గంతులే యించగల నాయకీయత గలవి. ఆ నాటకీయతలోని శీఘ్రత ఏ పరితనయినా ఇట్టే కట్టిపడేస్తుంది.

ఆరో ప్రకరణం

# వళ్లత్తోళ్ ప్రకృతి చిత్రణ

తనకి ఇరవైయొక్క ఏళ్లున్నప్పుడు వళ్లత్తోళ్ ప్రకృతిమీద మొదటి కవిత చెప్పేడు. కాళిదాసు ఋతుసంహారానికి అపరిపక్వ అనుసరణ. ఋతువిలాసం అది. ఇదివరకు ఓ వందమంది కవులు చెప్పిన పాతబాణీయే అది. మాటవరసకి కవి తన ప్రియురాలికి శరద్రాత్రి అందాన్ని చూపిస్తూ అంటాడు.

పలుకు తేనియ లొలుకుదానా!
శరత్ శోభను చూసినావా?
వెన్నెలను తెలి వన్నె దుప్పటి
పుడమి పరుపున పరచెకాదా!

కోయిలపాట గొప్పదనం వివరిస్తూ చెబుతాడు:

విన్నావా గీతిక?
విరహంలో నిలిపించే
ప్రేమికులను జతగూర్చే
కోయిల ఓ దూతిక

అయితే యిలాంటి మామూలు పద్యాల మధ్య హఠాత్తుగా కొత్త అందాలు తోచి మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి.

గిరుల నుండి వాన దొరలి మురియుచున్నదీ
ఎదలు పొంగి నదులు నిండి పొరలుచున్నవీ
సుడుల నురుగు బొంగరాలు తిరుగుచున్నదీ
తరుమూలములూడి నీట కలియుచున్నవీ

వళ్లత్తోళ్ ప్రకృతి కవితలో ఉన్న సొగసంతా అందులోని వాస్తవికతలోనే ఉంది. శిష్యరికకాలం తర్వాత అతనిలో నిలదొక్కుకున్న లక్షణం ఇది. సాహిత్య మంజరి తొలి సంపుటాల్లో వచ్చిన 'సాయంకాలం షికారు', 'దేశంలో శరత్కాలం',

దేశంలో వేసవి'. 'నాటుపడవలో నదీ విహారం', 'భారత నది', 'తిరువొన్నావి నది, లాంటి కవితలు కేరళసీమలోని పరిచిత దృశ్యాలన్నీ స్పష్టంగా మరోసారి చూపిస్తాయి. అతని వాస్తవ దృష్టికి ప్రతీకలుగా అక్కడక్కడ ఏరితీసిన కొన్ని పద్యాలు.

గేదొకటి చేనులో విందారగిస్తోంది
దాని వీపున కాకి సవ్వారి చేస్తోంది
విసిరెనా కొమ్ములు, దొరుకునా దుమ్ములు!
(సాయంకాలం షికారు నుండి)

చెరువునుండి బయటకొచ్చి
ఒడ్డుచేరి ఒడలు పరచి
ఎండకాగు ఆ మొసళ్లు
నలనల్లని నాపరాళ్లు (శరదృతువు)

కార్తీక ఉదయం
స్నానాల సమయం
పక్షులు పాడుతున్నాయి కిలకిల
భక్తులు ఒణుకుతున్నారు గజగజ
అది తోడిరాగం
ఇది ఆదితాళం! (శిశిరం)

ఉడతలు అంటూ ఇటూ పెత్తనాలు చేస్తూంటే .
బుడతలు అవే చూస్తూ కేరింతాలు కొడుతూంటే .. (వేసవి)

ఇది వికరమైన వాస్తవిక సృష్టి. వీటితో సంప్రదాయ రీతి కలిపి సరళ సుందరంగా తయారవుతుంది అతని ప్రకృతి చిత్రణ. పునశ్చరణ అయితేనేం ఆ కల్పనలు ఔచిత్యం చెడనివి, సౌకుమార్యం నలగనివి, చైతన్యంతో తొణికిసలాడేవి. 'సాయంకాలం షికారు'లో నదిలో ప్రతిబింబితమైన గగనాన్ని ఇలా చూపిస్తాడు:

సంజెవేళ కెంపు చాయ
విండునదిని ప్రతిఫలింప
కెందామర లెన్నోగల
మందాకిని అనిపించును

'భారత పూర్తు'లో కొండలు నది హుషారుని గమనిస్తూ యిలా హాస్యో క్తులాడుతాయి.

నదకా ఇది? ఒయారాల హొయలు దొంతర
పడమటింటి కడలిచేర పడతి తొందర

'నాటుపడవలో నదీ విహారం'లో చంద్రుడు 'చీకటి రాత్రి అనే పంకంలోంచి' ప్రభవిస్తాడు. 'తూరుపు దిక్కున స్వచ్ఛమైన సరస్సులో తెల్ల తామర పువ్వులా ప్రకాశిస్తాడు. నదీ తరంగాలపై నాట్యంచేస్తున్నవి వెన్నెల కిరణాలా, కావు జల క్రీడలాడుతున్న శ్వేత హంసలు. 'వాన మేఘాల్ని పరికిస్తున్న రైతు'లో సంప్ర దాయ చిత్రకల్పనలయినా తనదైన నగిషీసని చూపెడతాడు వల్లత్తోళ్.

నలువైపులా మబ్బు కమ్ముకునిరాగ
భూదేవి తనువుపై నిగనిగల సిగ్గు
వరుడు సమయము చూసి దరిచేరువేళ
పెళ్లికూతురి బుగ్గ ఎరుపెక్కినట్లు
.... . .... ....... . ... .... ..
ఒడిలో సిరిలా ఓ మెరుపు
మెడలో విరిలా హరిధనువు
ఆ తనువేమో అతినలుపు
కరుణ కురిసెనా ఒడి విందు

ఎంతో హృదయాహ్లాదంతో కవి క్షణక్షణానికీ దృశ్యం మార్చే కేరళ ఋతు వులు గమనించి ఉండాలి. శరదృతువూ గ్రీష్మరుతువూ అతను వర్ణించాడు. వర్ష రుతువూ, ఆ తరవాత వచ్చే చక్కని వోనమ్ రోజులూ వివరించాడు. అతని దృష్టికి ప్రకృతి ప్రాముఖ్యం ఎంతో ప్రకృతికి మానవుడు స్పందించడం అంతే. 'శిశిరం'లో సాయంకాలపు వేళ చలిమంటల చుట్టూ జనం చేరడాన్ని వర్ణిస్తాడు. అరచేతులు ముందుకి చాచి మంటల వేడి తగిలేలా పెడతారుగా, అది అగ్ని హోత్రుణ్ణి దీవించడమట 'వేసవి'లో పొలాలు తడుపుకొనేవేళ రైతులు పాడుకునే పాట మనం వింటాం, మామిడిపళ్లు ఏరుకోడానికి చెట్లకిందకి పరిగెత్తే పిల్లల్ని చూస్తాం. 'వానాకాలం సాయంకాలం ఓ షికారు'లో కవి అంటాడు :

దాడి చేతు ననుచు గాలి చాటుచున్నదీ
మబ్బులన్ని డీకొనుటకు మూగుచున్నవీ

వెండి చినుకు 'ఛత్రపతులె' వెరచుచుండికీ....

వర్షంలో తడుస్తున్నా లెక్కచెయ్యక ముందుకి పోతున్న ఓ బీదవాణ్ణి వర్ణిస్తాడు:

గోచిదాల్చి తాటి ఆకు తలకు రక్షగా
పేద ఒకడు పోవుచుండె పెనుతుఫానులో
వానధార గాలివిసరు పట్టనట్లుగా
వాడున్న పెద్ద బాధ ఆకలొక్కటే!

ప్రకృతిలో మనిషిని వర్ణించేటప్పుడు ప్రకృతి అందచందాల్ని వివరించే సంగతి మాత్రం కవి ఎప్పుడూ మరచిపోడు. ఉదాహరణకి 'వేసవి' కవితలో కేరళలో వేసవి ఎలా ఉంటుందో కవి యిచ్చిన వివరాలు చూడండి. ఆరముగ్గిన మావిడిపళ్ళూ, బంగారు పూసల హారాల లాంటి పువ్వుల గుత్తులూ, ఆకర్షణీయమైన ఆకుపచ్చని పంటపొలాలూ, గ్రీష్మసంధ్యలో ప్రశాంతతా....ఇలాంటి ప్రకృతిలోని రమణీయ దృశ్యాలవైపే కవి దృష్టి ఎక్కువగా మళ్ళినా వళ్ళత్తోళ్ కవితలో భయానక భీభత్స దృశ్యాల వర్ణనకూడా చోటుచేసుకోక పోలేదు. కేరళలో ఓ వర్షాకాలం వరదలు వచ్చేవరకూ వానలు తగ్గనప్పుడు ప్రకృతి దుర్మార్గత ఏమిటో, బాగా అర్థమైంది. 'అద్వైతం, శివం, శాంతం'ల వర్షపు రోజులు అడవి ఏనుగులతో పోల్చబడ్డాయి. ఓ కొబ్బరితోటలో ఆ గుంపు జొరబడింది ఇంకేముంది? కొన్నిచెట్లు పెకలించబడ్డాయి. కొన్నిచోట్ల మట్టలు నేలమట్టం అయ్యాయి. ఏనుగుల కోపానికి సగానికి సగం చెట్లు నడుములు విరిగి పచ్చడి పచ్చడి అయ్యాయి. 'అతివృష్టి'లో అంతులేని వానవల్ల కలిగే దారుణ దృశ్యాలని వివరిస్తాడు కవి. కొమ్మమీది పిట్టలపై అతని దృష్టి పడుతుంది.

ఒణుకుచున్న బెదరుచున్న చిరుతప్రాణుల
రెక్కచాటు హత్తుకొనుచు తల్లి పిట్టలు
మెడను చాచి పైకి చూచు ఎన్నిసారులో
వాన తగ్గె నేమొ యనుచు గంపెడాశతో!
మనిషి దౌర్భాగ్యం సిట్టకంటె తక్కువేంలేదు:
మొలచుట్టూ ఓ గుడ్డ
అదికూడా తడిముద్ద
వాన వేళ పని ఏది!
కడుపుమాడు గతి మాలి.

'అన్య వేషభ్రమం' (విదేశ వస్త్రధారణా వ్యామోహం)లో 1945 లో సెప్టెంబరు దాకా వదిలిపెట్టని కేరళ ప్రళయ వర్షపాతాన్ని కన్నుల కట్టేట్టు వర్ణిస్తాడు కవి. ఆఖర్న కేరళీయుల దుస్తుల్లోని కొత్త పోకడల్ని గేలిచేస్తాడు కూడా. జాలిలేని వానతో అతనంటాడు :

కప్ప బెకబెక ఆపె నెందుకు?
తుప్ప తిప్పలు కురిసినందుకు
నెమలి పురివిడి ఆడ దెందుకు?
విలువునా ఇల ముంచినందుకు
మెరపు విసువిడి తొలగె నెందుకు?
పుడమి ఆశలు పూడ్చినందుకు

కేరళకి పట్టిన దురదృష్టాని కతనెంతో విలపిస్తాడు :

నడినిశి పున్నమి వేళయినా
కనులకు దొరకడు చందురుడు!
దినమున బారెడు పొద్దయినా
దరిశన మీయడు భాస్కరుడు!
పంటను కోసే వేళలలో
కంటికి నీరయె కేరళలో!

పరవస్త్రవ్యామోహాన్ని చివర్లో అన్యాపదేశంగా నిందిస్తూ శిరంతో కవి ఇలా అంటాడు

పొరుగు యింటి పులుపుకూర మధురమా!
నలుపు నీకు సొగసు నీదు శిరమా,
జిలుగులున్న చలువ వలువ డాల్చుమా!

వేసవి ఒకొలిక్కి వచ్చే సమయంలో ప్రకృతి సహజమైన ఓ ప్రత్యేక పరిణామానికి వళ్లత్తోళ్ సమ్మోహితుడైనట్టు కనబడుతుంది. మరేం లేదు. మబ్బులన్నీ గుమిగూడడం ఏదో ప్రళయం ముంచుకొస్తున్నట్టు ఉరుములతో మెరుపులతో ఆకాశంలో ఊరంత హడావిడీ, ఇంతాచేస్తే ఒక్క చినుకు పడకుండా ఎక్కడ మబ్బు అక్కడ తప్పుకోడం ..'వాన మేఘుల్ని పరికిస్తున్న రైతు'లో రైతు చాతక పక్షిలా మెరుపులతో ప్రకాశించే నల్లని మబ్బుల్ని ఎంతో ఆశగా చూస్తుంటాడు. మేఘ గర్జన మృదంగ ధ్వనిలా ఎంతో శుభసూచకంగా అతని చెవిలో

పడుతుంది. కారుమబ్బులు అతని కంటికి గడ్డి దుబ్బుల్ని నమిలే నల్లని దున్న పోతుల్లా కనిపిస్తాయి. తాపబాధ తీర్చడానికి ఆ శ్రీమన్నారాయణుడే ఈ మబ్బు రూపంలో అవతరించాడేమో అని అతను అనపడతాడు. అంతలో తీవ్రమైన గాలి వీస్తుంది. ఆ గాలి విసురు రాళ్ల వానలా తగలగా ఎక్కడి దున్నపోతు అక్కడే తోక ముడుస్తుంది'

జీవితం అనేది ఓ రణరంగం,
ఎంత గుండె గట్టి ఉంటే ఏం లాభం?
వజ్రాయుధం లాంటిది మన చేతికి చిక్కినా
అది ఉపయోగించే అవకాశం రావాలిగా!

'వేసవి చివర్లో ఓ రాత్రి'లో 'మెరుపులీల' చాలా తమాషాగా వర్ణిస్తాడు కవి ఇంద్రనీలాల వేదికలాంటి ఓ చీకటి రాత్రిలో ఓ మెరుపు ప్రవేశిస్తుంది. ఏదో సంజ్ఞచేసి మాయ మవుతుంది. ఇంకాస్సేపటికి వెండిబట్టల్తో తళతళ మెరుస్తున్న ఓ దేవత దిగుతాడు. అతడుకూడా ఎన్నో సంజ్ఞలుచేసి వెళ్ళిపోతాడు మూడోసారి బంగారు బట్టలు కట్టుకున్న మరో ఉజ్జ్వలమూర్తి ప్రత్యక్షమౌతాడు. కళ్లు మిరుమిట్లు కొలిపేలా అతను నృత్యం చేస్తాడు.

పెళ పెళా ఉరుముల భేరీ మృదంగాలు
తళతళా మెరుపుల మిరుమిట్ల నాట్యాలు
కుండపోతగ వాన కురియు సూచనలు
ఓ చుక్క వానయిన ఊడిపడదిసలు!

పక్షులన్నా జంతువులన్నా ఎంతో అభిమానం వళ్లత్తోళ్‌కి. పక్షుల గురించి ఎన్నో పద్యాలు రాశాడు. పశువుల గురించి కొన్ని రాశాడు. తన కిటికీ కెదురుగా కనిపిస్తూ గింజ లేరుకుంటున్న పావురాన్ని వర్ణిస్తాడు 'ఓ పావురం' అనే కవితలో: పక్షిని సాదరంగా పిలుస్తూ మొదలైన కవిత దాని అందచందాలు వర్ణిస్తూ సాగుతుంది.

ముక్కున పదమున చిక్కని లత్తుక
రెక్కల సందున రంగుల అల్లిక
ఎఱ్ఱని కన్నుల కుంకుమ అమరిక
అరటిపువ్వు నీ దేహము పోలిక
వివరించుటకై చాలునె నాలుక?

ఇలా వర్ణన సాగిస్తూ కవి ఆలోచనలో పడతాడు. మనిషి దుర్మార్గమూ, అతని తమిదీరని తృష్ణా; పక్షి అమాయకత్వమూ తృప్తీ.... ఇవన్నీ తలుచుకుంటాడు. పక్షి వెళిపోబోతే కవి పిలుస్తాడు.

హరివిల్లు సొరమా! అల ఏటి అందమా!
ఓసిపావురమా! బాసిపోబోకుమా!
పగడాల పాదాల నడయాడ నేర్చేవు
ఉండుండి భూమిని ముక్కుతో పొడిచేవు
మరికాస్త సేపుండి మదిని రంజింపుమా!

దాని మృదువైనమెడ కొంచెం పైకెత్తి ఇటు చూస్తుంది పావురం. అదే వీడ్కోలుగా భావించి కవి దాన్ని పోనిస్తాడు:

ఎంతసేపు విన్నా చూడ భ్రాంతి తీరును?
కొంత హాయి ఇచ్చినావు అంతె చాలును!
ఎదురు చూచు నీ సంతతి నింక కలియుము
ఇంటి పెద్ద విధి అదియే! చాలు మరలుము

'కోడి', 'పిట్టను కొట్టేశారు', 'రాక్షస బలి', 'సంతోషించు తల్లీ!' 'వృద్ధ కన్య' మొదలైన కవితల్లో సాటిజీవుల పట్ల అతని సానుభూతి. వాటి అందచందాలపట్ల అతని ఆహ్లాదమూ, పశుపక్ష్యాదుల హింసపట్ల అతని క్రోధమూ వ్యక్తమౌతాయి. 'రాక్షస బలి' అనేది కేరళలోని అమ్మవారి దేవాలయాలలో కోళ్ళను చంపి నైవేద్యం పెట్టే పద్ధతిని ఎదిరిస్తూ రాసింది. కోడిపెట్టను చూపిస్తూ అతను దేవతని ప్రశ్నిస్తాడు:

నిజం చెప్పు తల్లీ, నువ్వే ఇది కోరేవా?
ఈ పసిప్రాణిని చూస్తే నీపాలు చేపురావా!

భారతదేశంలో ఉన్న సంప్రదాయమైన అహింసాప్రవృత్తిని అతను గుర్తు చేస్తాడు:

గరికపరక పెకలించడానికయినా
పాపమని వెనుకంజవేసే దేశంలో,
అహింసను పరమధర్మంగా
త్రికరణశుద్ధిగా పాటించే భూమిలో,

మహాత్ములు నివసించే యీ సీమలో,
ఇంకానా ఆటవికతత్వం మనిషిలో !
మేధావులంతా ఎప్పుడో దీన్ని ఖండించారు
బలిపేరు చెప్పి ఎందుకిలా వీట్ని హింసిస్తారు !

'రైతుల జీవితం'లో పొలాల దగ్గర పశువుల పని చూస్తూ అతనంటాడు.

దున్నలూ !
సాక్షాత్తూ మీరు మా అన్నలు !
మా అమ్మ పాలకోసం మీతోపాటు మేమూ చూస్తాం తెన్నులు!
ఎద్దులూ !
తమరే నిజమైన పెద్దలు !
తమరు దున్ని పండిస్తేనే అమరుతాయి మానోటికి ముద్దలు !

ప్రకృతి ఒడిలోని పిల్లల్ని ఎంతగానో ప్రేమించిన వళ్ళత్తోళ్ ప్రకృతికి సన్నిహితంగా బతికే మనుషుల్ని ఎంతో ప్రేమించాడు. అందర్లో వ్యయసాయ దార్లంటే అతనికి పంచప్రాణాలు. రైతులమీద ఎన్నో కవితలు రాశాడు. 'వర్ష మేఘాన్ని గమనిస్తున్న రైతు', 'శిస్తుదార్ల ప్రార్థన', 'రైతు గీతిక', 'అతివృష్టి' - అందులో కొన్ని. రైతంటే అభిమానం, అతని కష్టాలు సరిగా అర్థం చేసుకోడం, వాళ్ళని పోషిస్తున్నట్టు లోపించకుండా సానుభూతి చూపించడం, అలాంటి వాళ్లున్నం దుకు గర్వించడం....ఇవన్నీ ఆ కవితల్లో కనబడతాయి.

భారతదేశంలో కలకలలాడే కలకాలం నిలచే స్వరాజ్యస్థాపన జరగాలంటే కృషీవలుడి జీవితం సుసంపన్నం కావాలనే గాంధీ సూత్రాన్ని వళ్ళత్తోళ్ తరచు నొక్కి చెబుతాడు. అతడు సృష్టించిన కొన్ని దృశ్యాలు మనకెప్పుడూ గుర్తుం టాయి. పొలందున్నేవాడు ఎంతో ఆశతో నీటిమేఘాలవైపు చూడడం, వాన ముంపులో తన గుడిసె కొట్టుకుపోగా పేదవాడు అవాక్కు అవడం, — ఇవికొన్ని. పనిపాట్లు చేసుకునే ఓ హరిజనయువతి ఓ సాయంకాలం పొలంనుంచి తిరిగొస్తూ ఉంటే కొందరు పైజాతివాళ్లు, అందులో కవి కూడా ఉంటాడు, ఆమెకి ఎదురౌ తారు; వాళ్ళని తగిలి మైలపరచడం యిష్టంలేక పాపం ఆ అమాయకురాలు వాగా నీరు ప్రవహించే పక్కపొలంలోకి తప్పుకొని అందులో మునిగి పోతుంది! మరో సారి నాటుపడవ నడిపే బెస్తవాడు రామాయణం చదవడానికి కవి అనుమతి కోరు తాడు! - ఇలాంటివి మరికొన్ని.

అందులోని అందచందాలూ రకరకాల జీవితాలూ తప్పిస్తే ప్రకృతిలో వర్డ్స్‌వర్త్‌కి విశేషార్థం గోచరిస్తోందా? ప్రకృతి సాధారణంగా జీవితంమీద చింతనకి అతనికి అవకాశం కల్పిస్తోంది, అతని భావాలకు వివరణలు అందిస్తోంది. అయితే చాలావరకు ఈ భావాలు, ఎంత ఔచిత్యం ఉంటేఏంగాక, చప్పగా ఉంటాయేతప్ప ప్రకృతి స్వభావ సిద్ధతకీ ఏవిధంగానూ సన్నిహిత సంబంధం కలిగి ఉండవు వర్షపునీటి ప్రవాహంతో జీవన ప్రవాహాన్ని పోల్చడంగాని. తమిదీరని మనిషికీ ఇట్టే తృప్తిపడిపోయేపిట్టకీ తేడా చూపడంగాని - వీటిలో గాఢమైన నిశితదృష్టి ఏం కనపడదు; మానవ జీవితంలోగాని ప్రకృతి జీవితంలోగాని, వీటివల్ల అతను లోతుగా వెళ్ళి చెప్పిన పరిజ్ఞానం యేం లేదు.

వాస్తవిక చిత్రణా వివేక చింతనా - యిలాంటి వాటికన్న కల్పనకే కొన్ని కవితల్లో ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినట్టు కనవడుతుంది వర్డ్స్‌వర్త్. ఉదాహరణకి ప్రభాత గీతం అనే కవితనే తీసుకుందాం. ఉదయం అనేది ఓ పనిమనిషిగా మూర్తీభవిస్తుంది ఇందులో. గగన ప్రాంగణంలోంచి గతరాత్రి వాడిన పువ్వులు, అంటే, తారల్ని తుడిచేస్తుంది. వెండి భరిణ, అంటే- చంద్రుణ్ణి తీసేస్తుంది. మంచి నీటితో కళ్లాపి జల్లి కుంకుమతో అలంకరిస్తుంది. అలాంటి కల్పన మరింత అర్థవంతంగా కనిపిస్తుంది అతని 'సత్యగాథ'లో. అందులో ప్రకృతి అంతా సత్యదేవత వ్యక్తం చేసేదే అనిపిస్తుంది. పైనున్న మహాశూన్యంలో సత్యమనే వెలుగు మిలమిలలే చుక్కలుగా కనిపించేది, సత్యదేవత అంతఃపుర గోపురం వెలుగు కిరణాల్ని వెదజల్లి చీకటిని చెండాడుతుంది. ఆమె చేత్తో ఎత్తి పట్టుకున్న రజిత పాత్రలోంచి ఆమె సహృదయత ప్రసరిస్తుంది. అదే వెన్నెల. ప్రతిక్షణం మింగేస్తానని భూమిని బెదిరిస్తున్న సముద్రాన్ని ఆ దేవతశక్తి అనే ముద్దుబిడ్డ నెమ్మదిగా వెనక్కి నెట్టుతున్నాడు :

విద్యుల్లత ఆయుధమ్ము
ప్రతి సవాలు పలుకు ఉఱుము
జలధరమ్ము నీ రధమ్ము
పై నవ్వది ? విజయభేరీ !

సత్యదేవతలో ఉన్న ఈ శక్తి సామర్థ్యాలే ఆమె మనకొక దయామయమైన రక్షకురాలని భావింపజేస్తుంది :

తలొంచి నీ పదాలు ముద్దుగొన్న మనిషి, సత్యమా!
తలెత్తి విస్మయంగా తిరగొమ్ము, సందేహమా!

ఇక్కడ కనబడేది కనబడనిదాన్ని తాకడం గమనార్హం. దైవశక్తి, ప్రకృతి, మనిషి ఈ మూడిటినీ కలిపి కొనసాగిస్తూ కల్పనాశక్తి ప్రదర్శిస్తాడు కవి. కాని సామాన్యంగా వర్డ్స్‌వర్త్ గూఢంగా గాని, సంకేతపరంగా గాని, వేదాంత ధోరణిలోగాని చెప్పే కవి కాదు. జీవితాన్ని నిశితంగా పరిశీలించి ఆనందంలో ఓలలాడడంలోనే ఉంది అతని ప్రతిభ అంతా. ప్రకృతి అనేది అతనికి అంద చందాలు అందించే తరగని గని. కేవల పాదాలకు వెండి మువ్వలపట్టీలు అమర్చే కెరటాల్ని చూస్తూ అలా ఎంతసేపయినా ఉండిపోగలడతను. సరిగ్గా అమరుతాయా అవి? సరిగ్గా పట్టలేవని తీసేస్తాయి. మళ్ళీ పెడతాయి. సృష్టికర్త ప్రేమతో ప్రసా దించిన పిల్లగాలులు. మబ్బులు, సెలయేళ్లు యిలాంటివి ఎంత చూసినా తృప్తి అవదు ఈ జగత్తు అనేది దేవుడెంతో దయతో తన కిచ్చిన కానుకగా అతను పొంగిపోతాడు.

చల్లనిగాలి వింజామర మేను వాల్చ మేదిని
కాంతినీయ పసిడిదివ్వె రవ్వలుగల చాందిని
ఇన్ని యిచ్చె కరుణాత్ముడు ఎంతని కొనియాడను!
ఏమి లోటు కలిగిందని ఇంకా చెయిజాచను!

ప్రకృతిపట్ల వర్డ్స్‌వర్త్ దృక్పథాన్ని వివరించడానికి పై పద్యం ఓ దృష్టాంతం. ప్రకృతి మానవుడికి ప్రసాదింపబడిన ఓ వరమనీ, మానవజీవితానికి నేపథ్యమనీ అతని ఉద్దేశం. నాశనకారిగా ప్రకృతి తయారయినప్పుడు కూడా దయానిహీనంగా చిత్రింపబడిందిగాని ప్రకృతిని మనిషిపట్ల కిరాతకంగా, స్వేచ్ఛాప్రవృత్తిగలదానిగా, నిర్లక్ష్యంగా వర్డ్స్‌వర్త్ ఎక్కడా చూపించలేము. ప్రకృతిని ఓ సజీవపదార్థంగా భావించకపోడంలో అతను పిసరైన సంప్రదాయవాది. ప్రకృతిపట్ల పరిచిత దృక్పథాలకే అతను ప్రాముఖ్యం యిచ్చేది. మహత్తర గంభీర దృక్కోణాలు కూడా అతనిలో భీతి రేకెత్తించలేవు. అతని దృష్టికి ప్రకృతి అనే స్తంభం అటు దేవుణ్ణి యిటు మానవుణ్ణి కలిపే సాధనం. ప్రకృతిలోని చిత్ర విచిత్ర సౌందర్యం చూసి ఆనందించడం, ప్రకృతిని మానవాత్మగా రూపొందించడం, జీవితంమీద సుభాషితాలు చెప్పడానికి ప్రకృతినుంచి ప్రేరణ వెదకడం—వీటన్నిటిలో, ప్రపంచంలో యింకా యిలాంటి సంప్రదాయ కవు లెందరో లేరు. వారిపక్షమే వర్డ్స్‌వర్త్.

ఏడో ప్రకరణము

# వళ్ళత్తోళ్ కాల్పనిక కవిత

వళ్ళత్తోళ్ పురాతన రీతుల్లో తాకలుదేరి మతసంస్కృతీ సంప్రదాయాల్లో కూరుకుపోయిన కవి. పోనీ పాశ్చాత్య ప్రేరణలలో చిక్కుకుంటాడా అంటే అదీ లేదు. అలాంటి కవికి కాల్పనిక కవితవైపు కాలెలా సాగుతుంది? ఈ శతాబ్దపు తొలి దశాబ్దాల్లో మలయాళ సాహితిలోనూ, కేరళ సంఘజీవనంలోనూ వచ్చిన కొన్ని కొత్తపోకళ్ళ ప్రభావానికి మాత్రం అతను లోనుగాక తప్పలేదు. అతని పురాతన కావ్యధోరణి మరీ పట్టూ విడుపూ లేనిదేం కాదు, కొత్తపద్ధతి దేనికయినా చోటు యిచ్చే విశాలదృక్పథం గలదది. కొంతవరకు వళ్ళత్తోళ్‌ని కాల్పనిక కవి అనవచ్చు. మలయాళంలో కాల్పనిక కవితావాద ప్రగతికి అతను బాగా దోహదం చేశాడు. సంప్రదాయకవిత యీ కాల్పనిక కవితతో రాజీపడడంలో ఆశ్చర్యం ఏమీలేదు, కొత్తధోరణి దేన్నైనా ఆదరించే లక్షణం సంప్రదాయకవితలో ఉండనే ఉంది.

కాల్పనిక కవితలోలా ఆధునిక మలయాళ కవితలో ఓ ముఖ్య లక్షణం ఉంది. ఇతివృత్తం పరిధిని మించి కవి క్రిందకి దిగడు. తన భావనలన్నీ వ్యక్తీకరించడానికి దాన్నో అవకాశంగా తీసుకుంటాడు. సకృత్తుగా పాఠకుడితో సూటిగా మాట్లాడినట్టు కనపడినా అతను స్వగతం చెప్తున్నట్టే ఉంటుంది కవి అంతర్గత భావాలు చాటుగా విన్నట్టు అనుభవం కలుగుతుంది చదువరికి. ఉత్తమపురుషలో చెప్పబడినది మలయాళకవితలో అక్కడక్కడ వినిపిస్తుంది, 'జ్ఞానప్పణ' (జ్ఞాన గీతిక) లాంటి తొలి కవితలలో ఇది గుర్తించవచ్చు. కాని, మొత్తంమీద నిర్దుష్టమైన బాణీల కవితాధోరణుల్ని అనుసరించి పందొమ్మిదో శతాబ్దం చివరి వరకు కవులు బాహ్యప్రపంచ పరంగా అందించడంతోనే సరిపెట్టుకున్నారు. ఆంగ్లవిద్యా పరిచయంతో మార్పు అనివార్యమైంది. ఆంగ్లకవితాపఠన, ప్రత్యేకించి కాల్పనిక కవిత ఓ కట్టిపడేసే అనుభవం. మలయాళంలో కొత్త చిగుళ్ళు వెల్లివిరిశాయి. తమ ఆలోచనలూ అంతఃకరణాలూ బహిర్గతం చేసిన కవుల లఘుకృతులకి గిరాకీ పెరి

గింది. సహ్యాద్రిని చూడగానే తనకు కలిగిన భావాన్ని వ్యక్తంచేసిన ఎ. ఆర్. రాజ రాజవర్మగారి 'మలయవిలాపం', వి సి. బాలకృష్ణ పణిక్కర్‌గారి 'విశ్వరూపం' తొలి మలయాళ విషాదగీతికగా పేర్కొనదగిన ఆయన రచనే 'ఒరు విలాపం' (ఓ విలాపం)- ఇవి మలయాళ కవితలోని నూతన ధోరణులకు ఉదాహరణలు. సి. ఎస్. సుబ్రహ్మణియన్ పొట్టిగారి 'ఒరు విలాపం' (ఓ విలాపం), కె. సి. కేశవపిళ్లెగారి ఆసన్న మరణ చింతాశతకం (చావు సమీపించినవాడి భావపరంపర) కూడా ఈ కోవకి చెందినవే. అందులో ఆయాకవులు నిబ్బరమైన ఆత్మపరధోరణి ప్రదర్శించారని కాదు, కవి గొంతుక మరింత స్పష్టంగా బయటపడేది. కుమారన్ ఆశాన్‌గారి వీణపూవు (రాలిన పువ్వు), సన్నని అన్యాపదేశమనే ముసుగు ధరించిన విషాదాత్మక రచన, కొత్తధోరణి నిలదొక్కుకుందని చెప్పడానికి నికరమైన సూచన. ఈ నూతన రచనా చేతనకి వళ్ళత్తోళ్ లఘుకృతులు భారీఎత్తునే తోడ్పడ్డాయి. చాలా వరకు అతని కృతులు వర్ణనాత్మకాలు. సాధారణంగా ఓ అంతర్గత మానసిక స్థితిపై ఆధారపడి పైకి వస్తుంది భావన. ఆ భావన వెదజల్లబడితే ఏర్పడేది వర్ణన. కాబట్టి 'నాటుపడవలో నౌకా విహారం', 'నా మాతృదేశానికి', గాలికి కొట్టుకుపోయిన నా కవిత' లాంటివి స్పష్టమైన ఆత్మాశ్రయ కవితలు. 'బధిర విలాపం', 'పండిన నా తల చూస్తే', 'మా చిన్నమ్మాయి' మొదలైన అతని రచనల్లో ఈ ధోరణి ఇంకా సుస్పష్టం. 'బధిర విలాపం'లో అత నంటాడు:

తెల్లవారిన తగ్గదా అవి
నాటి రాతిరి నిదురపోయితి
ఉదయమాయెను కుదరదాయెను
చింతయే మిగిలెన్.

జగత్తులోని వివిధ శబ్దాలు వినపడక, మనస్సుకి పట్టిన మందకొండితనం తగ్గే మార్గం కనపడక బతుకు నిద్రాణమై పోయిందట. అంతేకాదు:

సాటి కవులను కలసినప్పుడు
వారు కవితలు చదివినప్పుడు
చెవిని చేరక తెలియనేరక
కష్ట మనిపించున్.

'పండిన నా తల చూస్తే'లో అతని భావప్రవణత కొత్తధోరణులు ప్రదర్శిస్తుంది: చావుని సంబోధిస్తూ అత నంటాడు:

నీ చీకటి నగరి సొగసు పేర్కొన తరమే!
నీ సోదరి విదురవలన నా కనుభవమే!
నీ కంటక పథము పయిన కాలిడ వశమే!

ఆ తర్వాత అతనిలా ప్రశ్నిస్తాడు:

ఎంతో కష్టపడి పోగుచేసిన ప్రేమను
ఏమంటూ నీ రాజ్యంలో ఆవిష్కరించను?
నా దత్తపుత్రిక 'సానుభూతి' బాష్పాల మాలను
ఎలా నీ శూన్యనగరిమెడలో అలంకరించను?

అతని దేశభక్తి పద్యాలూ జాతీయ కవితా సాధారణంగా గాఢానుభూతిని ప్రదర్శిస్తాయి. తనేం చెబుతున్నాడో అందులో కవి సంలీనం కాలేదని పాఠకు డెలా కనుకోగలడు?

అయితే ఆయాపదాల పూర్తిఅర్థం తీసుకుంటే వళ్ళత్తోళ్ కవిత ఆత్మాశ్రయ పద్ధతికీ కాల్పనిక పోకడకీ చాలా దూరం. ఆయన భావనలు చాలవరకు చప్పనైనవి. ఆ అనుభూతులు పైపై అలంకారాలతో బందీకృతమైనవి. కాల్పనికమైన విచ్చల విడితనంలోకి జారుకోడానికి అవకాశం లేనివి. వళ్ళత్తోళ్ ఆత్మాశ్రయ ధోరణి అంతో ఇంతో 'గ్రే' రాసిన 'ఎలిజీ' పోలినది. ఎలిజీలోని హృద్యమైన అను భూతి ఒకటే ఒకటి - మనోవ్యథ - అందులోని ఆలోచనలు హుందాగా చిత్రితమైనా సర్వ సామాన్యమైనవి. శైలి సరళం, సుకుమారం. నడక లలితం, మనోహరం, వీటన్నిటితోపాటు కవి హృదయం మనక మసకగా విషాదభరితంగా బయటపడి పోతూనే ఉంటుంది. వళ్ళత్తోళ్ లోకూడా శైలి ఎంతో చక్కగా మలచినది. కేరళ హిందూ సంస్కృతి సర్వసాధారణమైన హావభావాలకు స్పందించేది. అయితే ఉన్న వాటితోనే కవి సాన్నిహిత్యం పొంది పఠితకు అతని వ్యక్తిత్వం ఎరుక అవుతుంది. వళ్ళత్తోళ్ తెగువతో ఆత్మాశ్రయ కవితను రాయకపోయి ఉండొచ్చు. కాని ఆత్మా శ్రయకవితా తరంగాన్ని ప్రవేశపెట్టడంలో మాత్రం ఎంతో సహాయం చేశాడు. అదే తర్వాత తర్వాత మలయాళ సాహిత్యాన్ని ముంచెత్తించింది.

కవుల్ని కాల్పనికవాదు లనడానికి కారణం ఉంది. వర్తమానం వాళ్ళకి తృప్తినివ్వదు. వాళ్ళ ఉత్సాహాన్ని తృప్తిపరచే ఆదర్శం కోసం గతాన్ని శరణు కోరుతారు. ఆంగ్ల కాల్పనికవాదులకు ఈ విధంగానే మధ్యయుగాలు అలరించాయి. మొగలుల వైభవం చూసినా, రాజపుత్రుల సాహసం విన్నా, ప్రాచీనుల వాల్లభ్యం

తలపోసినా భారతీయ కాల్పనికవాది 'అష్మకూచి' అయిపోతాడు! వళ్ళత్తోళ్‌కి కూడా గతం అంటే పంచప్రాణాలున్నూ, మహాగ్రంథాలన్నా కావ్యపురాణాదు లన్నా అతని ప్రాణం లేచివస్తుంది. ఎన్నో అంతస్థులున్న ఆనాటి రాజప్రాసాదాల్లో విహరించడమన్నా ఆ జలయంత్రాలు చూస్తూ సేదతీర్చుకోడం ఎంతో ముచ్చట.

గత గగనమార్గాల వెంట
పద తిరిగివద్దాము, గంట
అంటాడతను 'కిలిక్కొంచల్'లో.
ఊహా విమానయానం
ఓహో సుఖాల వాలం!

ఇందులో వళ్ళత్తోళ్ పద్మపురాణం నుంచి ఓ సంఘటన కథా వస్తువుగా స్వీకరించాడు. సీత చిన్నపిల్లగా ఉన్నప్పుడు ఓ చిలకల జతని పట్టిస్తుంది. ఓదాన్ని పంజరంలో పెడితే రెండోది శపిస్తుంది. పదగుంభనలోనూ, శైలిలోనూ, పదను పడిన భావనలోనూ ఇదొక మనోహర కవితగా మార్చేడు అతను. జనకుని రాజధానివైభవంలోనూ, మహారాణి రాజతీవిలోనూ, సీత మనోహరబాల్యంలోనూ పాఠకుడు దీన్ని చూడవచ్చు. పదేపదే రామాయణ ప్రతిధ్వనులు వినవచ్చు. ఈ కవిత జనకుడి ఆదర్శరాజ్యంలోకీ, బాల్యంలోని ఆదర్శమాధుర్యంలోకీ, గతంలోకి ఓ విహారయాత్ర. శ్రీకృష్ణుడికి సంబంధించిన కవితలు 'ఓ బొమ్మ', 'అక్రూరుడి బృందావనయాత్ర', 'కర్మభూమి మృదుపాదాలు' ఆదర్శప్రాయమైన గీతాన్నీ, శతాబ్దాలపాటు గారాబుబిడ్డగా పరిగణించబడిన ఆదర్శబాలుణ్ణీ మళ్ళీ మనముందు విలబెడతాయి. ఉషా అనిరుద్ధుల పురాతన కాల్పనికగాథలోని ఊహాచిత్రమే 'చెరసాలలో అనిరుద్ధుడు'లోని ఇతివృత్తం.' శిష్యుడూ తనయుడూ'లోని పాత్రలు దేవుళ్ళూ, దేవతలూ పురాణప్రసక్తిగల పరశురాముని ఒకే ఒక మానవపాత్రా. 'కేరళకు నాయకుడు', 'ఆ అంగుళి', 'భక్తిపాండిత్యమూ' అనే కవితల్లో పురాణ ఇతివృత్తాలే ఉపయోగించబడ్డాయి. 'కొంచ ఎలుక ఉత్తరం'లో మహారాష్ట్రవీరుడు శివాజీ కనిపిస్తాడు. 'హిందూస్త్రీల ఔన్నత్యం'లో మొగలాయీ చక్రవర్తి హుమయూన్ జీవితంలోని ఓ కల్పిత గాథ సంఘటన వివరించబడింది. వీటిలోనూ యిలాంటి యింకెన్నో కవితల్లోనూ పొంగిపొరలే ఆనందంతో గతంలో విహరిస్తాడు వళ్ళత్తోళ్. ఒక్కొక్కప్పుడు సన్నివేశాలపై కేంద్రీకరిస్తాడు. ఒక్కొక్కప్పుడు పాత్రలు సృష్టికరిస్తాడు. ఒక్కొక్కప్పుడు నీతిసూత్రాలూ, పారమార్థిక ఆదర్శాలూ బహిర్గతం చేస్తాడు. ఏమైతేనేం గతంలోకే కవిత గమనం. అయితే

గతానికీ వర్తమానానికీ మధ్య వ్యవధి ఒకటి ఉండాలనే సామాన్య కాల్పనికవాదనా స్పృహ వళ్ళత్తోళ్‌కి లేదనేది గుర్తుంచుకోవాలి. గతంలో రక్షణకోరే బాధిత శరణార్థి కాదతను. గతం అనేది అతనికి ఆదర్శాలు విరజిమ్మే ఓ సాధనం. వర్తమానం అనేది అదెంత అపరిణితమైనదైనా గతంతో తెగతెంపులు చేసుకోడానికి వీలు లేకుండా కొనసాగేది. ఆర్షభారతం అనేది అతనికో నిత్యసత్యం. దాని గొప్పతనాన్ని అతడు గానం చేస్తాడు.

అప్పుడప్పుడు అతని రచనల్లో పూర్తి కల్పనాచిత్రమో, కేవలం అలంకారప్రాయమైనదో కనిపిస్తుంది. 'ఒరు యువవింతే ఆత్మసంయమనావి' (ఓ యువకుడి ఆత్మనిగ్రహం) ఓ బ్రాహ్మణయువకుడు ఓ అందాల అప్సర కోరికని తిరస్కరించడం చూపిస్తుంది. 'ఒరు భావన' (ఓ భావన)లో ఓ దేవకన్య వీణ వాయిస్తూంటే ఆమె ప్రియుడామెవైపు తన్మయతతో చూడడం, సుకుమారమైన ఆమె వ్రేళ్లు నొప్పితో కందిపోతే అతడా వాద్యాన్ని ఆపెయ్యమని చెప్పడం ఇవన్నీ ఎన్నోరకాల వర్ణనలతో వివరణలతో కనుల కట్టేట్టు చెయ్యబడింది. 'ఒరు వీరపత్ని' (ఓ వీర పత్ని)తో యుద్ధభూమికి వెళ్ళబోయే ఓ వీరుడూ, అతని భార్యాబిడ్డలూ విడిపోడం వర్ణించబడింది. అతని కవితల్లోని సన్నివేశాలు కట్టుకథల్లోంచి తీసుకున్నవయినా ఇతిహాస పురాణాల్లోంచి గ్రహించినా వాటన్నిటిలోనూ కాల్పనికవాద లక్షణం వెల్లివిరుస్తూ ఉంటుంది. పదలాలిత్యం, పదునుపెట్టిన రూపం, పరిణితి చెందిన భావనా ఈ కవితల్ని హృదయంగమంగా తీర్చిదిద్దేయి.

శృతిమించిన భావన కాల్పనిక వాద లక్షణం. పిల్లలమీద వళ్ళత్తోళ్ కృతుల్లో వాత్సల్యం పొంగిపొరలుతుంది. 'సంతాన సౌఖ్యం', 'కత్తిళ్ పరాన్న కవిత' (గాలిలో కొట్టుకుపోయే కవిత) 'ఎంతే కాచు మగళ్! (మా చిన్నమ్మాయి) ఇవన్నీ గాఢానుభూతితో తొణికిసలాడే రమణీయ రచనలు. అతని దేశభక్తి కవితల్లోకూడా గగనానికెత్తేసే చైతన్యం కనిపిస్తుంది. అదొక్కొక్కప్పుడు కాల్పనికవాద తీవ్రతను చేరుతుంటుంది. అయితే అతని ప్రేమకవిత్వం మాత్రం కాల్పనిక పాత ఆదర్శాల్ని చేరుకోలేదు, అవి సంప్రదాయ ప్రేమగాథలు, సంప్రదాయ గార్హస్థ్య ప్రేమగాధలు, లేదా సంప్రదాయ కల్పితగాధలు. అయితే వాటిలోకూడా అక్కడక్కడ కాల్పనిక వాదస్పర్శ లేకపోలేదు. 'రాధాయుతే కృతార్థత' [రాధ కృతార్థత]లో రాధ తన ప్రియుడితో కలాపాలూ, తనని కవ్వించి నిరాదరించిన అతని బుద్ధులూ అన్నీ గుర్తుకు తెచ్చుకుంటుంది. 'నిరాకరిస్తే నేం, అతను నివసిస్తున్న భూమ్మీదే బతికే అదృష్టం ఉంది. అదెంతకాదు!' అని సరిపెట్టుకుంటోంది. ఈ కవితలోని అను

భూతి అసందర్భ మనిపిస్తుంది. 'ఆఖరి ఉత్తరం' నాటకీయ ధోరణిలో సాగిన ఓ స్వగతం లాంటిది. తన ప్రియుడు అన్యాయంచేస్తే భామ అనే ఓ గర్భవతి ఆత్మ హత్య చేసుకుంటూ ఆఖర్ని ఉత్తరం రాసి పెడుతుంది. మొగాళ్ళ ప్రత్యేక హక్కుని గట్టిగా ఖండిస్తుంది ఆమె:

కాంతని వెంటేసుకు తిరగొచ్చు
కాదని గెంటేసి తను బతకొచ్చు
మగాడికే ఈ ప్రత్యేక హక్కు
దగా పడిన స్త్రీకి దైవమే దిక్కు!

ఇదివరకే సూచించినట్టు 'జాతి ప్రభావం' లో గౌరి ప్రేమకోసం అన్ని త్యాగం చేస్తుంది. అతని మరో కథానాయకి భర్తని స్వర్గంలో కలుసుకోడానికి అతని చితి ఎక్కుతుంది. ఇంకో జాలరి యువతి, మునిగిపోయాడని నమ్మబడుతున్న భర్తని చేరడానికి సముద్రంలో గెంతుతుంది. 'మిణుగురును చూసి తార అనీ, రాత్రిని చూసి పగలనీ' కాంక్షించేటంత కాల్పనికవాద ప్రేమ లేకపోయినా, స్త్రీ పురుషుల ప్రేమానుభూతి జీవితంలోని ఒక్కిన అన్నిటికన్న బలీయమైన శక్తిగానే చిత్రితమైంది. వళ్ళత్తోళ్ వంటి సంప్రదాయావాదుల్లో కాలం ఎలాంటి కొత్త మోస్తర్లూ, కొత్త ఆదర్శాలూ బహిర్గతం చేస్తుందో దీన్నిబట్టి చూడొచ్చు. కళా నైపుణ్యంలోకూడా వళ్ళత్తోళ్ కాల్పనిక వాదానికి దోహదం చేశాడు. అతడు ఉప యోగించిన రీతిరివాజులు కాల్పనికవాద కవితకి తర్వాత తర్వాత చాలవరకు ఉప యోగపడ్డాయి. ఇలాంటి శిల్పాన్ని వాడడంలో ఇతడు మొదటివాడు కాడుగాని అతడు దాన్ని బహుధా ఉపయోగించడంవల్ల స్పష్టమైన కాల్పనిక కవిత త్వరగా వేళ్లూనడానికి అవకాశం కలిగింది. ఇదివరకు చెప్పినట్టు ఇందులో మొదటి పద్ధతి ఉత్తమ పురుషలో తను తలపోత రకం. రెండోది నాటకీయ లక్షణాలకి అధిక ప్రాముఖ్యం ఇచ్చిన కథాకవిత పద్ధతి. ఆ తరవాత చాలా మంది మలయాళ కవులు నాటకీయ సన్నివేశాన్ని వివరించడానికిగాని పాత్రల్లోని సంశ్లిష్టతని రూపొందించ డానికి గాని యీ ఏకపాత్రాభినయ పద్ధతినే వాడుకున్నారు. ఒడుపుగా సుళువుగా రూపాన్ని తీర్చిదిద్దడంలో వారు వళ్ళత్తోళ్‌కి ఎంతయినా రుణపడి ఉన్నారు. ఏక పాత్రాభినయ పద్ధతిలోగాని రూపక రచనా శిల్పంలోగాని వళ్ళత్తోళ్ నిష్ణాతుడేం కాదు, కాని ఓ సన్నివేశాన్ని కేంద్రీకరించడం, నాటకీయ సంభాషణలు సుళువుగా నడ పడం నాటకీయ గమనాన్ని సరళసుకుమారంగా పునర్నిర్మించడం, పాత్రల్ని ఆవిష్కరించడం - వీటన్నిటిలో నమూనాల్ని యిచ్చిన ఘనత అతనిదే. అతని

గేయనాటికల్లో అచ్చానుమ్ మకళుమ్ (తండ్రీ తనయా) ప్రథమస్థానం అలంక రిస్తుంది.

అతి సుందరమైన ద్రావిడ ఛందోరీతుల్లో మలచి మలయాళ కవితకి ఎనలేని సేవ చేశాడు వళ్ళత్తోళ్. కేరళ కల్పద్రుమం ముద్రణాలయం ప్రచురించే కవన కౌముది పత్రిక ద్రావిడ ఛందోరీతుల్లో వచ్చిన కవితల్ని వేసుకున్నందుకు విమర్శకు గురికావలసి వచ్చింది. సంస్కృత ఛందస్సు మాత్రమే కవితాభివ్యక్తికి తగినదని అనుకునేవారు. వళ్లత్తోళ్ ఎంతో నేర్పుతో ద్రావిడ ఛందస్సు నడిపించేవాడు. అందులోని మాధుర్యం చూసినా వివిధభావనలకు అనువైన ఆ సౌలభ్యం చూసినా ఎంతో ముగ్ధులయే వారందరూ. వళ్ళత్తోళ్ అన్ని రకాల ద్రావిడ ఛందోరీతులూ ఉప యోగించాడు. అన్నిటికన్న కేక, మాకందమంజరి ఛందస్సుల్లో అతని పరిపుష్ట మైన సాహితీరసజ్ఞత కనిపిస్తుంది. 15 వ శతాబ్దికి చెందిన చెరుస్సేరి, 18 వ శతాబ్దికి చెందిన కుంజన్ నంబియార్ తర్వాత వైవిధ్యంలో మాధుర్యంలో ఈ రచనలో యితన్ని మించిన చెయ్యిలేదు. 'ఛందోబందోబస్తు'తో సుకుమార శబ్దప్రయోగంతో మలయాళ కవితకి కొత్తశక్తు లిచ్చాడితను. ప్రత్యేకించి ఈ ద్రావిడ ఛందోరీతులకి స్వతహాగా కాల్పనికవాద లక్షణాలు లేకపోయినా పాతపద్ధతుల్నుంచి బయటపడ్డానికి కాల్పనిక పాదకలితాప్రగతికి ఊత యివ్వడానికే దోహదం చేశాయి

'వళ్ళత్తోళ్ కాల్పనికవాద కవేనా?' అనే ప్రశ్నకి 'అవును' అనొచ్చు 'కాదూ' అనొచ్చు. కాల్పానిక వాదంలోని సిగ్గు – అంతరంగ వేదన, తనకాలంతో తను సరిపెట్టుకోలేక ఏకాంతవాసినవే ద్వంద్వ ప్రకృతి - యివేం అతనిలో కన పడవు, అతని హృదయం ఆనందంతో నిండి ఉంది. ప్రస్తుత ప్రపంచమైనా, గత పురాణాలకాలమైనా అతని కులాసాకేం లోటులేదు. అతని జాతీయతకూడా అభూత కల్పనగాని విప్లవోద్దీపనగాని లేనిది. అది బుద్ధి స్థిరతగలది. ఆరోగ్యప్రదమైనది. ఆదర్శవాదంగాని ఉత్సాహంగాని ఉవ్వెత్తున లేచినప్పుడు తప్ప అది కాల్పనికం అని పించుకోదు. ఉన్నదానితో తృప్తిపడి కలిగినదానితో కమ్మగా బతికే జీవన దృక్పథం అతనిది. అతని అంతరంగం తరచి చూస్తే సంప్రదాయవాది కాని కాల్పనికవాది అనిపించుకోడు. అయితే అతని కవితలో అంతప్రధానం అనిపించుకోని కొన్ని కాల్ప నిక కవితా లక్షణాలు కనిపిస్తాయి. అవి సహజంగా ఉన్న అతని సంప్రదాయ కవితా కమనీయతకు మరింత మెరుగు దిద్దుతాయి. మలయాళ కవితలోని నూతన శకోదయానికి అవి దోహదం చేశాయి.

ఎనిమిదో ప్రకరణం

# గద్య రచయితా విమర్శకుడూ

కేరళోదయం కి సంపాదకుడిగా ఉన్నప్పుడూ తర్వాత ఆత్మపోషిణి నిర్వహించినప్పుడూ వళ్ళత్తోళ్ ఎన్నో పుస్తక సమీక్షలు చేశాడు, ప్రాంతీయప్రాముఖ్యం గల ప్రక్రియ లెన్నో రాశాడు. అతని పుస్తక సమీక్షలన్నీ అతని స్నేహితుడు కట్టి కృష్ణమారార్ 1925 లో గ్రంథవిహారం అనే పేరున సంపుటిగా ప్రకటించారు. ఈ సమీక్షలలో కవి ఓ కవితావిమర్శకుడిగా మారేడు. ఏమాత్రం బాగున్నా ఎంతో సహృదయతతో మెచ్చుకునేవాడు, సముచితమైన శయ్యా నిర్మలమైన భాషా ఉన్నవో లేవో వెయ్యికళ్ళతో గమనించేవాడు. లేని పాండితీ ప్రకర్ష ప్రదర్శిస్తే ఆ గుట్టు మట్లు రచ్చకీడ్చడంలో మాత్రం వెనుకంజ వేసేవాడు కాడు. అతని సమీక్షా విధానం ఏమిటో ఆత్మపోషిణిలో చెప్పేడు; పుస్తకాలలోని మంచిసంగతులు ఎత్తిచూపడం, రంగంలోకి దిగే ఔత్సాహిక నవరచయితల్ని ప్రోత్సహించేలాగ దోషారోపణ మానెయ్యడం. విమర్శకుడు నిజాయితీపరుడుగా, ఉదారుడుగా ఉండాలేగాని కఠినుడు కాకూడదు. కాని వళ్ళత్తోళ్ ఒప్పుకుంటాడు, కవుల వలయంలోకి ఎలాగో దూరి సరస్వతితో సమరం చేసే కొందరిపట్ల తను కొంతవరకు కాఠిన్యం వహించక తప్పలేదని. విమర్శకుడనేవాడికి పాండిత్యం, నిజాయితీ, గ్రాహ్యతా, జ్ఞాపకశక్తి ఉండాలనే విషయం ఇప్పు డందరూ మరచిపోయారనీ, విమర్శ అనేది కేవలం ఎదుటిపక్షాన్ని దెబ్బతీసే బలమైన సాధనంగా ఉపయోగపడుతోందనీ వళ్ళత్తోళ్ ఎంతో బాధపడ్డాడు.

అతని కవితలోలాగే అతని విమర్శలోని మూలసూత్రాలన్నీ సంప్రదాయపరమైనవి. సంప్రదాయ సంస్కృత విమర్శా విధానానికి తన లోకజ్ఞానం అవగాహనా జోడించి తన విమర్శకి మార్గదర్శకంగా చేసుకున్నాడు. పుస్తక సమీక్షల్లో మూలసూత్రాల విపుల విశదీకరణ కనపడదు; భాష స్వచ్ఛతా, పదాల నిర్మలతా. శయ్యౌచితీ - వీటిమీద తను ఏర్పరుచుకున్న అభిప్రాయాలనుబట్టి అతను విమర్శిస్తాడు.

తిరువాన్కూరు మహారాజును ప్రశంసిస్తూ రాయబడిన ఉళ్ళూర్ కవిత మంగళ మంజరిని అతను సమీక్షించాడు. అందులో మొదటి వాక్యం ఇదీ: కేరళలో 'కవి' అనే బిరుదుకు తగిన వాళ్ళెవరైనా ఉంటే వాళ్ళలో ప్రప్రథమస్థానం ఉళ్ళూర్ పరమేశ్వర్ అయ్యర్‌ది. భావచిత్రణకీ, చెవి విందుచేసే పదలాలిత్యానికీ, కుంటుపడని లయ విన్యాసానికీ ఎంతగానో మెప్పులందుకుంటుంది అది. అలాగని అందులోని లోపాలు ఎత్తిచూపకపోలేదు వళ్ళత్తోళ్. విశేషణాలూ చిత్రణలూ పునరావృత్తమయాయనీ, మహారాజుమీద ప్రేమ తీవ్రత అతిశయోక్తిగా మారిందనీ అంటాడు. ఒక కవి తనతో సమానహోదాగల కవిని విమర్శించినప్పుడు ఎంతో విగ్రహం ప్రదర్శించాలి. అందుకనే పదప్రయోగంలో ఎంతో మెలకువ చూపిస్తాడు వళ్ళత్తోళ్. ఉళ్ళూర్ ఈ సాధారణ కవిత మాత్రమే వళ్ళత్తోళ్‌చే విమర్శింపబడడం దురదృష్టకరం. కుమారన్ ఆశాన్ రచన 'లీల' సమీక్షలో వళ్ళత్తోళ్ అభిప్రాయాలు మరీ స్పష్టంగా బయటపడిపోతాయి. లీల బృహత్తర కవిత. దాని గొప్పతనం వళ్ళత్తోళ్‌కి తెలుసు. హృదయపూర్వకమైన ప్రశంసతో అతను మొదలెడతాడు. ఆశాన్ స్వయంప్రతిభ గల కవి. భావనలో నూతనత్వం విషయవివరణలో ప్రత్యేక శ్రద్ధా గోచరిస్తాయి కనుక లీల గొప్ప కవిత. 'విప్రలంభ శృంగారాన్ని కరుణారసంతో కలిపి అంత అందంగా వర్ణించిన కవిత మలయాళంలో మరొకటి లేదు. ఉందంటే అది ఆ కవికృతి అయిన నళిని' మాత్రమే! తర్వాత విమర్శకుడు కవితను 'నఖశిఖ పర్యంతం' పరిశీలించి, నిర్మాణం బలహీనంగా ఉందనీ, భాషలో దోషాలు ఉన్నాయనీ తేల్చిపారేస్తాడు. మహోన్నతమైన సంస్కృత పదాలూ, కొన్ని మోటు అయిన గ్రామ్య మలయాళ పదాలూ కలపడం అతని కంతగా నచ్చినట్టు కనబడదు. ఎన్నిటినో ఉదాహరిస్తూ వాక్యనిర్మాణంలో ఆశాన్ తీసుకువచ్చిన కొత్తమార్పులు అవకతవకగా ఉన్నాయనీ తాను ఆమోదించలేననీ చెబుతాడు. ఒక్క విశేషణం అటూ ఇటూ మారుస్తే అర్థం చెడిపోతుంది. కటువైన శబ్దాలూ, వ్యాకరణ దోషాలూ, అర్థమో ఔచిత్యమో అనుప్రాస కోసం అదేపనిగా త్యాగం చెయ్యడం. వీటితో భాష ఆకును అందకుండా పోకను పొందకుండా పోయింది. ఇన్ని లోపాలుంటే యేంగాక లీల ఎంతో చక్కని కవిత. 'కొమ్మలతో అస్తమానూ కుమ్మితేనేం, తంతేనేం, తియ్యనిపాలిచ్చినంతకాలం ఆవుని వెడల నడపవలసిన అవసరం లేదు' అంటాడు. 'లీల మీద ఈ సమీక్ష వళ్ళత్తోళ్ శక్తినీ బలహీనతనీ ఒకేసారి ఎత్తిచూపుతుంది స్వచ్ఛందవాదీ, సరిఅయిన సంప్రదాయవాదీ భాషా సంబంధమైన దోషాలు మన్నించలేకపోవడం సహజమే. అయితే అదే కవిత చక్కనిదనడంతో సరిపెట్టక 'రమణీయం' 'మనోహరం', 'ప్రత్యేకించి

బ్రహ్మాండం' అనడం ఆశ్చర్యకరం. ఈ రమణీయకత ఏమిటో ఎక్కడా నిర్వచించడు. 'విప్రలంభ శృంగారాన్ని కరుణారసంతో కలిపి' అనే పదజాలం కవితకో మొగ్గ తొడిగిన గాఢమైన వాంఛకీ, కాల్పనిక తీవ్రతకీ సరియైన న్యాయం చేకూర్చ జాలదు. కాల్పనిక వివరణలలోని అంతరార్థం చెప్పే వింధ్యపర్వతాల దృశ్యమూ, సంపెంగల సువాసనలూ, మదనుడికోసం లీల వెదకడం, నదిలోనికి గెంతిన మదనుడి ఆత్మహత్యా ప్రయత్నం మొదలైనవి సంప్రదాయ విమర్శకుడి పరిశీలనలోకి రాలేకపోయాయి. కవితలోని అందచందాలకి వళ్ళత్తోళ్ సాహితీ నిశితగ్రాహ్యత స్పందించింది, కాని ఆ అందచందాల అనుపానులు అర్థం చేసుకోలేకపోయాయి అతని పరికరాలు. 'లీల'లోని లోపాలు ఎత్తిచూపడంలో అతను కచ్చితమైన, న్యాయమైన పంథాయే అవలంబించాడు. కాని దాన్ని ప్రశంసించేటప్పుడు మాత్రం అస్పష్టంగా సర్వసాధారణ పద్ధతిలో చెప్పేడు.

భాష నిర్దుష్టంగా ఉండాలని చెప్పేటప్పుడు మాత్రం అతని సాహితీ విమర్శ ఆద్యంతం తలమానికం. కవి భావమే ప్రధానాంశంగా తీసుకోవాలనీ, శబ్దలౌల్యంలో పడి కొట్టుకుపోరాదనీ వళ్ళత్తోళ్ నొక్కి చెబుతాడు.

మలయాళకవితలోని కొన్ని కొత్తపోకడలు తనకి అసంతృప్తి కలిగిస్తున్నాయని సాహిత్య పరిషత్ ప్రసంగాలలో అతను చెప్పేడు. మలయాళాన్ని ప్రేమ గీతికలు ముంచెత్తివెయ్యడం సంప్రదాయవాది వళ్ళత్తోళ్‌కి వెరపు పుట్టించింది. అతను అనుకోవడం ఈ గీతికల పుట్టుక మనోదారిద్ర్యం వల్లనే అనీ, కవుల తారుణ్యంవల్ల కాదనీ. కవితల్లో నవలల్లో ప్రేమికులు ఆత్మహత్య చేసుకునే సామాన్యధోరణి తనకి అలజడి కలిగిస్తోందని అతను చెప్పుకున్నాడు. ఆధునిక మలయాళ కవిలోని అవధులు దాటిన కాల్పనిక వాదాన్ని అతను హాస్యం చేసినా యువకవి బృందం అంటే అతని కెంతో ముచ్చట. 'అనన్యమైన సాహితీ సంపద తలదాలుస్తున్న వీళ్ళని చూస్తే, మన సాహితికి వేయబడిన ఛాందసభావాలు ఊడ గొట్టగల వీరి బలమైన బాహువులు చూస్తే, మా కళ్ళు ఆనందంతో వి ప్పారుతాయి.,

సంస్కృత గ్రంథాల నెన్నింటినో మలయాళంలోకి తీసుకువచ్చిన వళ్ళత్తోళ్‌కి అనువాదంమీద స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. అతను నొక్కిచెప్పేది రెండు విషయాల గురించి. మూలం అనేది మరోభాషలోకి రాగల అనువాద యోగ్యత కలిగి ఉండాలి. రెండోది అనువాదం మక్కికి మక్కిగా సాగాలి

'స్వేచ్ఛానువాదం' అంటే అతనికి పరమ ఒళ్ళుమంట. మంచి మంచి పుస్తకాలు మలయాళంలోకి తర్జుమా చెయ్యవలసిన అవసరం గురించి సాహితీ సదస్సుల్లో ఎన్నోసార్లు చెప్పేరు అతను. 'ఎంటెభాష' అనే అతని చక్కని కవితలో ఈ భావమే పదే పదే వ్యక్తపరచాడు.

రాజకీయ సంఘటనలూ, సాంఘిక సంస్కరణలూ మొదలైన సాహిత్యానితో సంబంధం లేని విషయాలపై కూడా వళ్ళత్తోళ్ కొన్ని రచనలు చేశాడు. సాంఘిక జీవనంలో ప్రభుత్వ జోక్యం అతనికి చికాకు కలిగించింది. చట్టాల వలన సాధారణంగా ప్రగతి సాధించలేమని అతని ఉద్దేశం. నాయర్ వ్యవస్థీకరణం, నాయర్ పెళ్ళిళ్ళను చట్టబద్ధం చేసే ఓ శాసనం గురించి వళ్ళత్తోళ్ రాశాడు "వివాహ విషయం చట్టబద్ధం కానంత మాత్రాన మాతృస్వామ్య వ్యవస్థ ఏ యిబ్బందికి గురి కాలేదు. వివాహం అనేది ప్రేమపై ఆధారపడింది. ఈ పవిత్రానుభూతి చట్టం వల్ల కలిగిందని రుజువు లేదు మరి!" పాతవన్నీ పనికిమాలినవని కొట్టిపారెయ్యడం కొత్తవన్నీ గొప్పవని నెత్తి నెక్కించుకోడం మూర్ఖత్వ మని అతని అభిప్రాయం. "ఓ మలయాళీ మలయాళీగా నివసించగలగడమే గర్వించదగిన విషయం". ఇది అతని స్థిరమైన ఉద్దేశం. లౌకికజ్ఞానాన్ని ఉపయోగించే సంప్రదాయవాదిగా అభిప్రాయాలు వ్యక్తీకరిస్తాడు అతను. బోధనాత్మకమైన సంప్రదాయ దార్శనికం వళ్ళత్తోళ్‌ది.

వళ్ళత్తోళ్ గద్యశైలి అతని కవిత లాంటిదే; ఉన్నతమైనది, ప్రకాశవంతమైనది, లయమూర్ఛనకి సన్నిహితమైనది అది సంస్కృత మలయాళాల చక్కని కలగలపు. ఇక అతని ఉపన్యాసాలో ? నెమ్మదిగా చెప్పేవాడుకాని కచ్చితమైన స్థాయీ స్పందనా ఉండేవి. అవి హాస్యంతో తొణికిసలాడేవి. రూపకల్పనతో మిల మిల మెరిసేవి. అతని కవితలాగే అవీ హృదయాహ్లాద చిత్రణలతో ఆకస్మికదీప్తితో వెల్లివిరిసేవి. శిల్పచాతురి విషయం చెప్పుకోవాలంటే వళ్ళత్తోళ్‌ది స్పష్టమైన వ్యక్తిత్వముద్రగల పాతకాలపు మలయాళం గద్యరచన. పెద్దపెద్ద వాక్యాలనయినా, వాక్యాలమధ్య ఇరికించే చిరువాక్యాలనయినా, వాక్యభాగాలనయినా స్పష్టంగా నిర్మించే నేర్పు అతని సొమ్ము. ఈ వాక్య నిర్మాణ లక్షణాలు ఆధునిక మలయాళ గద్యం అంతో ఇంతో పోగొట్టుకుంది, దాని బదులు మరింత సులువైన శైలి సంతరించుకుంది.

# తొమ్మిదో ప్రకరణం

# వళ్ళత్తోళ్ కవితా శిల్పం

జీవనమర్మం తెలిసినవాడే రచనాశిల్పం ఎరిగినవాడే గొప్ప కవి అనిపించుకుంటాడు. ఏజాతి చరిత్రలో అయినా అటువంటి కవులు అతి అరుదు. అత్యున్నత శ్రేణి కవితా ప్రతిభకు కాస్త దిగువగా 'గాయకులూ, స్వాప్నికులూ' దర్శనమిస్తారు. ఈ స్వాప్నికుల కలలు జీవితంలోకి నిశితదృష్టితో చొచ్చుకుపోయే కాంతి జ్వాలలు. ఈ గాయకుల గీతాలు భాషా మాధుర్య పరిపూరితాలు. వళ్లత్తోళ్ ఈ మాదిరి గాయకుడు. జీవితంపై లోతైన అవగాహన గల మర్మయోగిగా దార్శనికుడిగా అతన్ని పేర్కొనలేము. అలాగని ఆత్మలోని అంతుపట్టని ప్రాంతాలను వెన్నాడే స్థాపకుడనీ అనలేము. అతని మామూలు మాటే అందాల పాట. అతని చేతిలో ఇత్తడి పుత్తడి అవుతుంది. ఆధునిక మలయాళ కవు లందరిలోనూ అంతటి నేర్పుతో భాషని పెభాషనిపించడం అతనికే చెల్లింది. భాషలో అతని చేతని పలకని శబ్దమంటూ లేదు. మలయాళం మాధుర్యం, మనోహర లావణ్యం, ఆ భాష జిగిజీవం అన్నీ అతని కవితలో మార్మోగుతాయి. ఎంటెభాష [నా భాష]లో మలయాళం లక్షణాల గురించి ఎంతో గొప్పగా చెబుతాడు అతను. మాతృభాషలో అతను పేర్కొన్న యీ లాలిత్యాలన్నీ అతని శైలిలో కనబడతాయి. 'కిలిక్కొంచల్', 'భారత స్త్రీకళ్ తాన్ భావశుద్ధి', 'మగ్దలిన మరియమ్', వంటి, అతని కవితల్లో కనిపించే నైర్మల్య మాధుర్య సౌందర్య లక్షణాలు మళ్ళీ చెరుస్సేరిగారి కృష్ణగాథలో తప్ప ఆ ఎత్తున కనిపించవు. 'శిష్యనుమ్ మకనుమ్'లో యీ లక్షణాలు కాక జిగి, జీవాలూ, నడకలో వేగం కలిసి సమ్మోహనకరంగా రూపొందింది. ఒక్కొక్కప్పుడు, 'ఉంగరం', 'భక్తి పొందితి', 'నాటుపడవలో నదీవిహారం' లాంటి అతని కవితల్లో భాష సరళంగా సూటిగా ఉండనూ గలదు. ఇది వర్డ్స్ వర్తుగారి వాఙ్మయం లాంటిది, భావనాస్పర్శతో గద్యం పద్యంగా తలెత్తుతుంది. మరొక్కప్పుడు అతని కవిత వర్ణనతో వివరణలతో పొరపై పొర అమర్చిన 'పూతరేకు శిల్పం'తో రుచి విస్తుంది. ఎంటె కొచ్చుమగళ్ [మా చిన్నమ్మాయి]లో వాళ్ళపాప చిరునవ్వు దివిటీ అతనిలా వెలిగిస్తాడు.

నవ్వుతున్న లేపెదవులు
చూడ చూడగా
విరుస్తాయి గులాబీలు
ఒకటి ఒకటిగా
కన్ను విచ్చు కమల కళలు
ఒకటి ఒకటిగా
తెలుస్తాయి పగడపురుచు
లొకటి ఒకటిగా

ఇంకా అతను అంటాడు :

జాంటి తేనె సురభిళాలు
గుబాళించగా
స్పర్శకైన లేతమేను
కంది పోవగా
పున్నెమ్ముల ప్రోవు అనుచు
జనులు మెచ్చగా....

ఇలా నడుస్తుంది కవిత. ఇలాంటి మధుర మనోజ్ఞవర్ణనలు అతని కవితల్లో కోకొల్లలు. చెవికి విందు చేసే సంస్కృత పదజాలంతో రంగరించి రాజ ఠీవిగల మహోన్నత శైలి అతని కొన్ని కవితల వైలక్షణం. ఇతివృత్తాన్నిబట్టి, భావస్థితిని బట్టి శయ్య మారుతుంది. వళ్లత్తోళ్ నిపుణుడి సునాయాసధోరణిలో మణి ప్రవాళం లక్షణాలన్నీ - సత్త్వం, మృదుత్వం, కోమలత్వం - దేనికదే కొల్లగొట్టగల సమర్థుడు. అలాగని సొగసుదనం, గొప్పదనం, తీపిదనం ఏమైనా తగ్గుతాయనా? ఊహుం. ఔచితి విషయంలోని సంప్రదాయశీలమైన 'ఆ రకంలోని ప్రతి దానిలో తొంగి చూపే అందచందాలు' అనే భావం అతని కవితలోని ప్రధాన లక్షణం.

కచ్చితమైన విషయావక్త వివరణలు వళ్లత్తోళ్ కవిత కూర్పుకు దిట్టతనం ఇస్తాయి. పైన పద్యభాగంలో ఉదాహరించినట్టు వివరణలు అందంగా ఆదర్శవంతంగా ఉండవచ్చు. ఎంతో సునిశిత పరిశీలనతో కనులకట్టే దృశ్యాలు చిత్రించగలడుకూడా. ఏ మోతిరమ్ [ఆ ఉంగరం]లో అలసిపోయిన మలయాళ బ్రాహ్మణ భాటసారిని ఇలా వర్ణిస్తాడు :

రవిదాటి మదిలోకి పవలంత అలసి
ఒక్కింత శ్రమదీర కను మూయదలచి
అతని భుజమున నోలె తాటాకు గొడుగు
వామ హస్తము దాల్చె ఆగొడుగు అడుగు
తాప మోర్వగలేక జందెపు పోచలు
ఎదను తడిపే చెమట చెలమలో పొరలు
సాష్టాంగ దండాలు సంఖ్య పెరుగుటచేత
బొడిపి కట్టుచె వాని నుదుటపై రాత!
తిరుమణీ చూర్ణాల విండిపోయెను నాసలు
విష్ణువియమాదుల వెలుగుచున్నవి కనులు
విరిచికట్టెను అంగవస్త్రమ్ము కొసలు
వేరు చెప్పగ వేల పిలక పొంపెసలు!

తన మాటలతో కదలికలూ కవళికలూ వివిధోచ్చారణలూ చిత్రింప గలడు వళ్లత్తోళ్. కిలిక్కొంచల్ లో తల్లిని చేరుతున్న చిన్నసీతను వర్ణిస్తాడు:

పూర్తికాని వకుళమాల చేయిజారగా
గాలిలోన తేలిపోవు పసిడిపూవులా
చిన్నసీత తల్లి ఒడిని చేరె హాయిగా
'బాల లేత కటిసీమకు భారమేమొ ఒడ్డాణం!'
ఒడ్డాణపు చిరుమువ్వలు ఒలకబోయు భావన
'పరిగెత్తకు చిట్టితల్లి పడిపోయిన ప్రమాదం!'
కడియమ్ముల నిక్వణాలు కలతచెందు సూచన

'మధులక్ష్మి'లో ఆమె నృత్యం ఇలా వర్ణిస్తాడు:

వేలుఉంచి బుగ్గపైన
నడుమున ఒక చేయి ఆన
లయగతి తన కెన లేదన
నటనమాడె భాసమాన.
కరయుగమున పదయుగమున
విరిసరములు సొగసులీన
భావరాగ యుక్తమైన

భరతనాట్యమాడె, చావు.
పాలనురుగు పథమో యన
నడయాడెను హంసయాన
గడదేటిన జాణ గాన
అడుగడుగున జాజివాన.

'తిన తిండీలేదు, కట్ట గుడ్డాలేదు' అనే కవితలో ఒకప్పుడు బాగున్న సంసారపు కటిక దరిద్రాన్ని వర్ణిస్తాడు. కుక్కని చూస్తూ ఓ క్షణం ఆగుతాడు.

ముసిరి చంపు కొణుసులతో
ఎగిరిపడే బొమికలతో                ఘనక మొకటి పడి ఉన్నది.

వయసు పెరిగి అలసటతో
కరుణ గొలుపు చూపులతో                స్వామిని పరికిస్తున్నది.

వర్ణత్తోళ్ వర్ణనాత్మక ప్రతిభకోసం పద్యాలకి పద్యాలే గాలించనక్కర్లేదు. చిన్నపద్యంలో అయినా ద్విపదయినా పాదమయినా అఖరికి పదసముదాయమైనా అది కవిపిస్తుంది.

వర్ణత్తోళ్‌ది విస్తృతమైన అలంకార శైలి. అతని ప్రతిపద్యంలోనూ కావలసినన్ని ఉపమలూ రూపకాలూ ఈ కల్పనలలో అతని కవితా చాతురీ భావనానైపుణీ కళ్లకు కడతాయి. సర్వజన సమ్మోహనకరంగా భాసించడమేకాక అతని సహజ సృజనాత్మకశక్తి ద్యోతకమౌతూంటోంది ఈఅందాల అల్లికలలో. 'ఓ పావురం'లో అతనంటాడు :

ఎఱ్ఱని కన్నుల కుంకుమ అమరిక
అరటిపువ్వు నీ దేహము పోలిక

మాసిపోయి, చినిగి, దూది పైకి వస్తున్నా అతని కల్పనాశక్తి కన్ను మూసుకోలేదు !

అనాకారి శిరోజాల
దోపుకున్న మల్లియలన
చిరిగిన నీ తనువునుండి

దూది తొంగి చూస్తున్నది.

అదే విషయం. మరో భావన. మరో చిత్రణ

మహారాజా గతి అయినా
ఇంతేనని నవ్వలేక
తమరి పొట్ట పగిలేనన
దూది తొంగి చూస్తున్నది.

చెరసాలలో అనిరుద్ధుడు ఎన్ని రకాలుగా కనిపించాడో కవి కళ్లకి!

మట్టిప్రమిద దీపికవలె
మరుభూమిని మామిడివలె
మసిబారిన మల్లికవలె
బూజెక్కిన వేలుపువలె
గతి తప్పిన గ్రహస్థితివలె
కూలబడిన ఏనుగువలె
నిందపడిన సజ్జనువలె
అనిరుద్ధుడు కనపడెలే !

కొచ్చుసీత అమ్మమ్మ రంగసాని 'మదనుని విరిగిన ములికిలా నిద్రిస్తోందని' వర్ణించాడు. 'నాగిలా'లో వాళ్ళ కులాచార ప్రకారం భావదేవుడు వెళ్లికూతురిని అలంకరిస్తూంటే వాళ్లన్న అతన్ని తీసుకుపోయి గురువుగారి ముందు నిలదీస్తాడు :

సొగసు దిద్దెను క్రొత్త వధువును
పదును పెట్టెను పూలధనువును

'మగ్దలిన మరియమ్'లో క్రీస్తును చేరబోయేముందు మేరీ వేగం తగ్గిందట'

కడలి సంగము ముందు
సరిత వేగము క్రుంగు

అంటాడు కవి. వర్షాకాలంలోని నీటి ప్రవాహాన్ని చూస్తూ కవి భావిస్తాడు :

ఎత్తు ఎక్కి తీరాలని
ఎంతెంతో కామన
మత్తు వదిలి పోగానే
క్రిందికి పడు సూచన

కురద, ముళ్లు, గతుకులలో
వరద పడే యాతన
తుదకు కాలవాహినిలో
తప్పని నరి మేళన
సీటినడక రీతులలో
జీవయాన భావన! ('వానలో విహారం')

'గాలికి కొట్టుకుపోయే కవిత'లో కవి రాస్తున్న కవితగల కాగితం ఎగిరి పోతూంటే వాళ్ల చిన్నబ్బాయి పట్టుకుంటాడు :

భావమేమి బోధపడెనో
తీరికగా చదవసాగె
చేదయినా వయసు మీరి
చెడదేమో కవిత తీపి!

స్వతంత్ర భారతం గురించి తన అభిప్రాయం ఇలా వర్ణిస్తాడు

భారతమను మత్తేభము
సాధించెను స్వాతంత్ర్యము
నలగద్రొక్క కాదుసుమా,
విస్పహాయ జనరక్షకు!

భావనలెన్నో పదిలపరచబడ్డాయి యీ కల్పనలలో. ప్రతీ ఒక కల్పనా విస్తృతసుందర దృక్పథానికి ఓ చిన్నసూచన. ఈ ఉపమలతో ఈ రూపకాలతో వళ్ళత్తోళ్ పదసముదాయాలలో పాదాలలో నింపిన ఈ మాధుర్యం, ఈ మానసో ల్లాసం తిరుగులేనివి, తమిదీరనవి.

వళ్ళత్తోళ్ కొన్ని కవితల్లో అన్యాపదేశ రచనాశిల్పం కనిపిస్తుంది. వైశా నమ్ పోరంపోరం [చాలు, చాలు యీ కన్నీళ్లు]లో భారత జాతీయ కాంగ్రెసును ఓ నదిగా చిత్రిస్తాడు. అది స్వేచ్ఛాసాగరం వైపు ప్రవహిస్తోంది. దారి నిండా ముళ్లూ రాళ్లూ ఆటంకాలు. స్వార్థపరులైన రైతులు దానికి అనకట్ట కట్టే ప్రయత్నం చేస్తారు. 'ప్రభాతగీతం'లో ఉదయం అనేది నింగి వాకిలిలో కళ్లాపు జల్లే పనిమనిషిగా చిత్రితమైంది. విజయీభవ్వాటక [నీకు విజయమే గాక]లో గొప్ప వీరోచితకృత్యం

అన్యాపదేశంగా నదిగా రూపొందింది. ఈ రెండు అర్థాలూ ఎంత అలవోకగా అతి కించబడ్డాయంటే యాంత్రికమని ఏమాత్రమూ అనిపించదు చదివిన వాళ్ళకి.

ఎంతటి అనల్పకల్పనా ధురీణుడైనా కవితతో సమానంగా కల్పన నిలబడ లేదని వళ్ళత్తోళ్‌కి స్పష్టంగా తెలుసు స్పష్టమైన అవగాహనా సరితూకపు అభి ప్రాయమూ — వీటికి కావ్యనిర్మాణంలో పెద్దరికం ఇచ్చి, ఆలోచన గట్టి అదుపులో ఉంచే సంప్రదాయపు తరహాకు చెందినవాడతను. అందుచేత అతని కల్పనా చాతు రిని సంపూర్ణకవితా సంకేతాలుగా పరిగణించకూడదు. అయితే అతని కవితలో కొన్ని కల్పనలు పునశ్చరణ కాకపోలేదు: నదులూ, వెలుగు చీకట్లూ - ఇలాంటివి. ప్రవహించే వాహిని అతణ్ణి ముగ్ధుణ్ణి చేస్తుంది అతని కవితావాహిని నిండా నదీమ తల్లులే - భారతపుఝ, తిరూర్-పొన్నైప్పుఝ, పెరియార్, నర్మద, గోదావరి, కాళింది. జీవితం, సాహసం అనేవి కూడా 'ప్రయాగస్నానం', 'వైశానమ్ పోరం పోరం' మొదలైన అతని కవితల్లో నదీరూపం దాల్చాయి. రాత్రీ, పగలూ, చీకటీ, వెలుతురూ అనే దాస్యం స్వేచ్ఛా, అజ్ఞానం, జ్ఞానం అనే కల్పనలు అతని ఎన్నో కవితల్లో వినవస్తాయి. ఇరుళిల్ నిన్ను [చీకటినుండి] అనే దార్శనిక కవితలో ఈ చిత్రణలు కొత్త సంకీర్ణతను సంతరించుకున్నాయి. అనంత తేజోరాశితో అతను అంటాడు :

ఎప్పుడైనా నిన్ను చూస్తానా అని
ఎందుకులే అది తలచుకుంటేనె ఎంతో భయం
నేనా, ఓ తమోగతప్రాణాన్ని!
వేయివెలుగులకన్న వెలుగుటగా నీమోహం
లేదులెద్దూ నిన్ను చూడాలని
అన్నిట్లో నువ్వున్నావని తెలుసుకుంటే అదే నయం!

వెలుగుకోసం అంతులేని మానవప్రయత్నం - ఎన్నియుగాలనుంచి జరుగు తూందో - అంతా చీకటి పాలయిందని అతని భావన. వేసటతో వేదనతో అతను ప్రశ్నిస్తాడు దీనికోసం ఇంకా ఎంత త్యాగం జరగాలని. చివరికి అంటాడు: 'ప్రతి రోజూ సూర్యుడుకూడా వెలుగుని అన్వేషిస్తూ తిరుగుతూ ఉంటాడు కాబోలు'. అతనికి అన్వేషణలో కాలు పెట్టడంమాత్రం ఇష్టంలేదు :

నే నొచ్చిన స్థల వివరం?
తమం :

ఆ చీకటి గుణగణనం?
అగాధం!
నేను పోవు పథవయానం?
తమం!
నడుమ ఏల వెలుగుమయం?
విరామం!

తక్కిన కవితల్లో ప్రాచీన పద్ధతుల్లోనే రాత్రింబవళ్ళ పంబంధాల్ని అతడు చిత్రిస్తాడు. 'కాలంమారి' (రోజులు మారేయి)లో చీకటిగుండెలో వేగుచుక్క విస్మరించలేని భీతి కలుగజేసిందిట. వేగుచుక్క 'సన్నంగా ఉంది, పేదరికంలో తెల్లబోయిన పాతచుట్ట బెట్టుకుంది. సూటిగా ధైర్యంగా చీకటి కళ్ళలోకి చూస్తోంది', చీకట్లో ఒకటితో ఒకటి యిలా గుసగుస లాడుకుంటున్నాయిట; చీకటి కొండలు పోయి వెలుతురు రావడం చూసి, ఎంతో ఆశ్చర్యపోతూ—

అంబర చుంబిత నిర్మిత సౌధము ఇల తాకినదా!
పదమున అణచిన పర్వత శిఖరము మరల లేచెనా!
విశ్వము నంతటి నమలిన ధైర్యము తలవండినదా!

దీనిలోనూ 'పారవశ్యం' లాంటి ఇతని ఇతరకృతుల్లోనూ స్వతంత్రం వెలుగుగా, దాస్యం పర్వభక్షకురాలు చీకటిగా చిత్రితమైంది.

ఈ కల్పనాశిల్పం వళ్ళత్తోళ్ కవితకి అల్లిక జిగిబిగి మాత్రమే గాక మరింత లోతైన అర్థాలు స్ఫురించే సుసంపన్నతని ప్రసాదించింది. ప్రాచీన సంస్కృత విమర్శకులు వ్రాక్కుచ్చిన ధ్వనీ ఔచిత్యమూ అనే రెండు మూల లక్షణాలూ ఇతని కల్పనా చిత్రాల్లో పుష్కలంగా కనిపిస్తాయి.

అంత పుష్కలమైన కల్పనా చాతురిగల కవి 'రంగుల్ని' అంత తక్కువగా ఉపయోగించడం ఆశ్చర్యకరం. అయితే సంప్రదాయసిద్ధమైన పచ్చని ఆరుబయలు ఆకుపచ్చని తివాసీలా, బుగ్గలు గులాబిమొగ్గల్లా, పావురం కళ్ల కుంకుమ తిలకాల్లా, పావురం కాళ్లు పగడాల్లా - ఇలాంటి వర్ణమేళన అతని కవితలో లేకపోలేదు. ఈ సంప్రదాయబాణి కల్పనాశక్తి ప్రదర్శకమైన వర్ణనలోకి అప్పుడప్పుడు దిగకపోలేదు 'కిలిక్కొంచల్'లో అతని మబ్బులరంగుల వర్ణన అద్భుతం:

చిక్కని అడవులు
సైకత స్థలములు
ఎఱ్ఱ తామరలు
బూడిద కొండలు

'రంగు రంగుకోపమే' అనే రమణీయదృష్టి, వాస్తవికదృష్టి సర్వసాధారణంగా వళ్ళత్తోళ్ కవితలో కవిపించదు. శబ్ద చిత్రణ మాత్రం ఇంతకన్న కాస్త ఎక్కువే.

ప్రవహించే నీటి గలగలా; మేఘాల గర్జనా, సాగర తరంగాల నిరంతర ఘోషా; స్పష్టమైన పిట్టల కిచకిచధ్వనీ, వీణ, మురళి, మృదంగాల నాదాలూ; పిల్లల రణగొణధ్వనీ - ఇలాంటి శబ్దాలు ఎన్నో వినిపిస్తాయి అతని కవితల్లో. ఓ ప్రత్యేక ఇంద్రియానికి విందుచేసే రూపకల్పన కాదు అతని కవిత. పంచేంద్రియాలనూ పరవశింపజేసే కవితా ప్రతిభ అతనిది. ఒరు చిత్రం (ఓ బొమ్మ) అనే శ్రీకృష్ణుని వర్ణించే కవితలో శబ్దస్పర్శ రూప రస గంధాల సమ్మేళనమైన అతని పంచామృతం కొంచెం రుచి చూడండి.

మెత్తదనం వెన్నెలది
తీయదనం ద్రాక్షలది
చల్లదనం చిరుగాలిది
చక్కదనం లేమావిది
లావణ్యం హరివిల్లుది
సౌగంధ్యం మల్లియది
తారుణ్యం సంధ్యలోది
పరమాత్ముని రూపంలో
ప్రతి అందం ప్రతి ఉన్నది.

'పట్టిల్ పొతింజా టీక్కొళ్ళి' (పట్టుగుడ్డలో విప్పుకణిక)లో నల్లని వర్షపు రాత్రి కారడవితో పోల్చబడింది.

నల్లగా వింగి విస్తరించుకొని ఉంది
కాలిపోయిన కానలా కానవస్తోంది

అప్పుడప్పుడు ఉరుములు వినవస్తున్నాయి
అవి సింహ గర్జనలు అనిపిస్తున్నాయి

'సంధ్యాప్రార్థన'లో ఓ పూరిగుడిసెలో ఓ దివ్యసుందరిని చూస్తే ఆతనికి

విపురు తప్పిన విప్పులా
బురదలో కెందమ్మిలా
మసకలో నెలవంకలా
కనిపించిందిట.

ఈ వివిధ చిత్రణలు వాటి సామాన్యలక్షణాల వలనగాని, తన సూక్ష్మపరిశీలన వలనగాని వళ్ళత్తోళ్ నిర్మిస్తాడు. తులనాత్మకంగా బేరీజు వేస్తే వాస్తవిక కల్పనల సంఖ్య తక్కువ. మిగిలిన వాటిలో కొన్ని సంప్రదాయసిద్ధమైనవి. మొత్తంమీద అన్నీ సార్వత్రికమైన పురాతన బాణీకి చెందినవి. భావనలనూ కవితా ప్రయోజనంలోనూ ప్రాచీన శిల్పానికి సంబంధించినవి. అవి కవితను సచిత్రం చేస్తాయి. స్పష్టత చేకూరుస్తాయి, అలంకరిస్తాయి. కాని కవిత మూలప్రకృతిని విశదీకరించేవి కావు. వాటిమటుకు అవి కవితను వెలుగులోకి తీసుకురానూ లేవు.

ఎంతబాగాచేసిన అనువాదం అయినా సరిగా ఎత్తిచూపలేని వళ్ళత్తోళ్ కవితా లక్షణం మరొకటి ఉంది. అది సంస్కృత ద్రావిడ ఛందస్సులపై ఆతని ఆధిపత్యం: సంస్కృతంలో జిగి, జీవాలు గల రచనలు చేశాడు. ద్రావిడ ఛందస్సులో ఒడుపులూ ఒయ్యారాలూ గల రచనలు చేశాడు. సంస్కృత శ్లోకాల్ని ప్రాదేశిక గేయ ఛందస్సుల్లో మలయాళంలోకి అనువదించడంలో పెద్దపీట ఆతనికే వెయ్యవలసి ఉంటుంది. ద్రావిడ ఛందస్సులో అత్యంత సుందరమైన దేదో చెప్పడం కష్టం. ఏదైనా ఎంతో అలవోకగా మలచుకొనే ఉపజ్ఞ ఆతనిది. అన్నిటికంటె 'కేక' ఎక్కువ ఉపయోగించేవాడతను. విసురులోనూ నడకలోనూ ఎన్నిరకాలుగానైనా మలచబడడంలోనూ అది ఇంగ్లీషు 'బ్లాంక్ వెర్స్' లాంటిది. మలయాళంలో కేక ఛందస్సుకి ఇప్పుడున్న ప్రాముఖ్యతకీ, భావకవిత కిదొక తప్పనిసరి సాధనంగా తయారుకావడానికీ వళ్ళత్తోళే కారకుడు.

వళ్ళత్తోళ్ కవితలోని ఓ ప్రత్యేక వైఖరి ఏమిటంటే అది క్రియాత్మకం, ఆ క్రియ విస్తరింపజేసే చలనస్వభావం. ప్రతిపాదంలోనూ ఏదో ఒకటి జరుగుతూ

ఉంటుంది. ఓ మాట అనడమో; మాట్లాడుతూ తలో, చెయ్యో ఊపడమో; మనిషి ఓ చోట నుంచి మరోచోటికి వెళ్ళడమో – ఇలా నాటకీయ చలనంలోని బలమైన కదలికగాని, ప్రగతిలోని నిత్య చలన జీవశక్తిలోని ఆకస్మికదీప్తిగాని కనిపిస్తుంది. నిశ్చలన సన్నివేశాలనిగాని, పదార్థాల్నిగాని అతను వర్ణించింది బహు తక్కువ. అతని కవితలో ప్రతివిషయంలోనూ గోచరించే చైతన్యానిదే పైచెయ్యి. ప్రకృతిలోని మానవ ప్రకృతిలోని సంచలన శక్తిని అతి సునాయాసంగా మలచగల అతని శక్తిని చూస్తే ఎవరికైనా విస్మయానందాలు కలుగుతాయి పైన పేర్కొన్న వర్ణనాత్మక భాగాలన్నీ యీ లక్షణాలకు ఉదాహరణలుగా నిలవగలవు. వళ్ళత్తోళ్ కవితల్లో కావలసినన్ని కథాకథనాలు. ఐదో ప్రకరణంలో చర్చించబడిన ఖండకావ్యాలు కాక 'నాయరు అమ్మాయీ, సాయిబూ' 'ఓ యువకుడి ఆత్మ నిగ్రహం', 'వీరపత్ని', 'దొంగకి ఓ కానుక' 'కుడవ కూడూలేదు, కట్ట బట్టా లేదు', 'పట్టుబట్టలో చుట్టబెట్టిన నిప్పుకణిక'. 'రాధ మనోరథసిద్ధి', పిట్టల కిలకిల', 'యువతాపసి' 'భారతస్త్రీల ఔన్నత్యం', 'భక్తి పాండిత్యమూ', 'నాగిలా', 'నరేంద్రుడి ప్రార్థన', 'అఖరిలేఖ' 'ఉరి ఎదురైనా'. 'అ ఉంగరం', 'సత్తెకాలపు సత్తెయ్య', 'మలయాళం తలమానికం', 'హరేకృష్ణ'. 'కులంసామర్థ్యం' లాంటి అనేకానేక కవితలు లఘుకావ్యాలకిందే చలామణిఅవుతాయి. ఇవికాక భావకవిత్వమో, నాటకీయశిల్పమో, అఖ్యానలక్షణ వివరించే 'గాలికి కొట్టుకుపోయే కవిత', 'పండిన నా తలచూస్తే', 'నాటుపడవలో నదీవిహారం' 'వానమేఘాల్ని పరికిస్తున్న రైతు' మొదలైన కవిత లున్నాయి 'అంపకానికి వెడుతున్న అక్రూరుడు' 'అంతఃపురంలోకి రావణుడి రాక' 'కర్మభూమి మృదుపాదాలు' 'పాపంనుంచి బయటపడడం' 'సంధ్యాప్రార్థన' కవితలు నాటకీయలక్షణమూ వర్ణనాత్మక శిల్పమూ కలబోసిరాసినవి. ఏరకం కవిత ఆయినా అన్నిటిలోనూ నాటకీయ వివరణ ఉంటుంది., ముందుకి ఉరికే వర్ణన ఉంటుంది. కవితకు అవసరమైన స్థాయిలో పాత్రని సజీవం చెయ్యడం ఉంటుంది. చరణ్గా రూపొందే క్రమానుగత చేష్టల ఎన్నిక కనబడుతుంది. 'కుడువ కూడూ లేదూ, కట్ట బట్టాలేదు' 'ఉరి ఎదురైనా' మొదలైన కవితల్లో నాయకీయ వివరణలు వర్గనాత్మక వివరణలతో పరిసమానంగా తులతూగుతాయి. కవిత వాతావరణానికే ప్రధానాంశానికి తగిన వర్ణన ఉంటుంది. అనుభూతితో కవితాధార సమఉజ్జీగా ఉండడానికి కూడా ఆ వర్ణన దోహదం చేస్తుంది. చేష్టల బాహ్యప్రకృతిపైనే తప్ప పాత్రల చిత్తవృత్తిపై కేంద్రీకరించకపోవడం ఈ కవితల పెద్ద లోపం. మనిషి అంటే అతని చేష్టలే అని అర్థం చెప్పుకునే సంప్రదాయ పద్ధతికి చెందినవాడు

తళ్ళత్తోళ్. మాటల్లోని క్రియల్లోని వాస్తవికాలకి సంప్రదాయవాదులు ఆకర్షితు లౌతారు. మానసిక సూక్ష్మాంశాలపట్ల అందులో సగమైనా పట్టించుకోరు మనిషి చేసేదీ, అలా చేస్తూంటే మనం కళ్ళతో చూసేదే - కచ్చితమైన సజీవమైన యీ భాగమే వాళ్ల అవగాహన చేసుకొనేది. అభ్యాసరీత్యా వ్యక్తిత్వం ఏర్పడుతుంది. నీరూ గాలీ అభ్యాసరీత్యా ఓ ప్రకృతి దృశ్యాన్ని తీర్చిదిద్దినట్టు. అంటే ఒకేరకం పనులుచేసే వాళ్ళంతా ఇంచుమించు ఒకేరకం నై జలక్షణాలు కలవాళ్ల అన్నమాట ప్రత్యేక లక్షణాలకంటె ఈ సామూహిక సాధారణ లక్షణాలే వాళ్ళదృష్టిలో వ్యక్తి త్వాన్ని నిర్వచించేది. సంస్కృత నాటకాల్లోని నాయకుల్ని 'ధీరలలితుడనీ', 'ధీరో ధీరోదాత్తు డనీ', నాయకుల్ని 'ముగ్ధ' అనీ, 'ప్రౌఢ' అనీ వర్గీకరిస్తూ ఉంటారే. దాన్ని సమర్థించే తర్కం ఇదే. పాత్రలలాగే భావావేశాలు కూడా వర్గీకరించబడ్డాయి. కొన్ని నిర్వచించబడిన చేష్ట లున్నాయి. వాటి వెనుక నిర్వచించబడిన అనుభూతులున్నాయి. ఈ అనుభూతులే కొన్ని నిర్దుష్ట ప్రమాణాల్లో వివిధ 'రసాలు'గా మారుతున్నాయి. ఈసంప్రదాయ బాణీల వళ్ళత్తోళ్ 'ఆరియు తేరిన వృద్ధమూర్తి' అసలైన సంప్రదాయ నృత్యరీతి — కధాకళి తత్సా హిత్యమూ అతన్నెంతగానో ప్రభావితుణ్ణి చేశాయి. అతని - 'మగ్దలిన మరియమ్' లో పాపపశ్చాత్తాపాల సంక్లిష్ట మనోచిత్రణ కనిపించక పోవడం 'నాగిలా'లో పెళ్ళిపీట మీంచి తపోభూములలోకి తరల్చబడిన యువకుడిలో ప్రేమత్యాగాల సంఘర్షణ సూక్ష్మవివరాలు లేకపోవడం అందుకనే అత్యంత సహజమైన విష యాలు, వళ్ళత్తోళ్ నాయకుడు నాయికి అందచందాలు గుర్తించుకుంటాడు, కాదన లేని ప్రగాఢ వాంఛప్రదర్శిస్తాడు, తల మున్కలుచేసే ఆ భౌతిక కామనలసామనస్యం కలిసే ఉంటుంది. 'అంతః పురానికి రావణుడిరాక' లో మండోదరి కొడుకు మేఘ నాధుడు తనకెంతో ముఖ్యమైన విజయం చేకూర్చి పెట్టాడు గనక ఆమెను గౌర వించాలనీ రావణుడు మండోదరి మేడకు వెళతాడు. అతనికి జరిగిన స్వాగత వైభవం ఎంతో రమణీయంగా వర్ణించబడింది 'రాముడి శత్రువు నైన నేను, నేను జయించిన ముల్లోకాలూ తెచ్చి ఆమె పాదాలముందు ఉంచినా ఆ యిల్లాలి రుణం తీర్చుకున్నట్టు అవదు' అనే ఒకే ఒక్క వాక్యంలో చేసిన తప్పుకి అతను పడే బాధ సంక్షిప్తీకరించబడింది. క్లుప్తీకరణలో చెప్పుకో తగ్గది గాని ఆ రాజ వైభవం, ఆ ఐహిక వైభోగం చూపించే చిక్కని వర్ణనల మధ్య ఇది అంత ముఖ్యం కాదేమో అనిపిస్తుంది. 'కవి దృష్టి ఎంతవరకూ ప్రసరించాలి' అనే విష యంలో వివాదం అనవసరం అనుకోండి. లయలో క్రియలో గోచరమయే బాహ్య

ప్రపంచాన్ని అతను సూటిగా చూస్తాడు. మనసు లోలోపలి పంచని పొరల్లో ఉండే సూక్ష్మవిషయాలకి కూడా 'ఓ ఊరూ పేరూ ఉంటుందనే' విషయం పట్టించుకో వలసిన అవసరమే అతనికి కనపడదు. ఉన్నదానినే కనులెదుట ఉన్నదానినే ఎంచుకుని, ఏరుకుని, ఎంతో అందంగా తీర్చి దిద్దగల శక్తి వళ్లత్తోళ్‌ది.

మలయాళ భాష ఎంత చెయ్య గలదో అంతా చేసి చూపించడంలోనే ఉంది కవిగా వళ్ళత్తోళ్ సార్థకత. అది అతని చేతిలో ఆడగలదు, పాడగలదు, సమ తలంలో మహానదిలా ప్రవహించగలదు, ఠీవితో రాణిలా నడవగలదు, దేవతలా కరుణ చిందించగలదు. అతని చిత్తవృత్తికీ సృజనాత్మక కవితాశక్తికి మంచి పొంతన ఉండి ఉండాలి. సమయోచితంగా స్పష్టంగా నవ్యంగా కవితను మెరుగు దిద్దడంలో పురాతన సంప్రదాయరీతిలోని సచ్ఛిల లక్షణాలన్నీ అతను పుణికి పుచ్చు కున్నాడు. లఘుకృతిని వైవిధ్యంతో నాటకీయతతో సజీవం చేశాడు. గేయరూప కాన్ని ఏ విధంగా మలచుకోడానికైనా వీలైన చలనశీలగా తీర్చిదిద్దాడు. పద సము దాయ నిర్మాణంలో అతనొక మహాశిల్పి. తన జీవన దృక్పథంతో పొందిన ఆనం దాన్ని తన శబ్దజాలంలో పొందుపరిచి పదిమందికి అందించగల మహాకవి వళ్లత్తోళ్.

## ఉపయుక్త గ్రంథసూచి


1. వళ్ళత్తోళ్, వి. ఉన్నికృష్ణన్‌నాయర్. మాతృభూమి, కాలికట్, 1962.

2. వళ్ళత్తోళ్ ఉపహార గ్రంథం సంపాదకులు· డా. చేలనాట్టు అచ్యుత మీనన్, డా. యస్. కె. నాయర్. జనతా ప్రెస్సు, 1948.

3. వళ్ళత్తోళ్ కవిత. సం : కవితా సమితి, యన్. బి. యస్., కోట్టయం, 1956.

4. మాతృభూమి వళ్ళత్తోళ్ పదిప్పు, మాతృభూమి, కాలికట్, 1958.

5. కైరళియుటె కథ, యన్. కృష్ణపిళ్లై. యన్ బి. యస్., 1958.